వార్త

# ఆదివారం

6 నవంబరు 2016



# ఆ సీట్లు పలికేను కోట్లు!

## మేటి కంపెనీల్లో మెండుగా ప్యాకేజీలు

# టైటిల్ సాంగ్ కోసం కండలు

మెగాపవర్ స్టార్ రామ్‌చరణ్‌తేజ్ చేస్తున్న తాజా చిత్రం 'ధృవ' పై అభిమానుల్లో భారీ అంచనాలున్నాయి.. గత సినిమాలు 'బ్రూస్లీ', 'గోవిందుడు అందరి వాడే' వంటి చిత్రాలు ఆశించిన విజయాన్ని సాధించక పోవటంతో చరణ్ కూడ ఈ సినిమాపైనే ఆశలన్నీ పెట్టుకుని కష్టపడుతున్నారు. ఇటీవలే విడుదలైన ఫస్ట్ లుక్, టీజర్ అనుకున్నట్టే మంచి స్పందనను రాబట్టుకుంది. ఇప్పటికే టాకీ పార్ట్ మొత్తం పూర్తి చేసుకున్న ఈ చిత్రంలో టైటిల్ సాంగ్ మాత్రమే మిగిలి ఉంది. ఈ పాటను నవంబర్ 2వ తేదీ నుంచి షూట్ చేయటం మొదలుపెడతారు. సినిమా మొత్తానికి హైలెట్‌గా నిలవనున్న ఈ టైటిల్ సాంగ్‌కోసం చరణ్ బాడీ లాంగ్వేజీని, లుక్స్‌ని పూర్తిగా మార్చుకునే ప్రయత్నం చేస్తున్నారు. అందుకే టీమ్‌లో వర్కవుట్లు చేస్తున్నారు. దీపావళి పండుగ అయినా సరే చెర్రీ వర్కవుట్స్ ఆపలేదు. ఇదే విషయాన్ని ఆయన భార్య ఉపాసన తెలుపుతూ ట్విట్టర్‌లో చరణ్ వర్కవుట్స్ చేస్తున్న వీడియోను కూడ పోస్ట్ చేశారామె. ఇక గీతా ఆర్ట్స్ పతాకంపై అల్లు అరవింద్ నిర్మిస్తున్న ఈ చిత్రంలో చరణ్ పోలీస్ ఆఫీసర్‌గా కన్పించబోతున్నారు.





తారాతీరం



# డైరెక్టర్‌గా మారనున్న సూపర్‌స్టార్ కుమార్తె

సూపర్ స్టార్ కృష్ణ వారసురాలిగా, మహేష్‌బాబు సోదరిగా ఇండస్ట్రీలోకి అడుగు పెట్టిన మంజుల త్వరలో దర్శకురాలిగా మారనున్నట్టు తెలుస్తోంది. పరిశ్రమలోకి వచ్చి నటిగా కెరీర్ ప్రారంభించిన మంజుల షో, కావ్యాస్ డైరీ, ఆరెంజ్ వంటి చిత్రాల్లో నటించారు. నటనలో ఉండగానే నిర్మాతగా మారి షో, నాని, పోకిరి, కావ్యాస్ డైరీ, ఏ మాయ చేశావే... వంటి పలు చిత్రాలను నిర్మించింది. ఆ తర్వాత కొన్నాళ్ల గ్యాప్ తీసుకున్న ఆమె ఇపుడు డైరెక్టర్‌గా తన ప్రతిభ చూపటానికి సిద్ధమవుతున్నారు.. ఆమె ఇప్పటికే యంగ్ హీరో సందీప్ కిషన్‌కు కథ చెప్పారని, సందీప్ కూడ ఒప్పుకున్నారని వార్తలొస్తున్నాయి. అలాగే ప్రముఖ నిర్మాత జెమినీ కిరణ్ ఈ సినిమాను నిర్మిస్తారని తెలుస్తోంది. అయితే ఈ విషయమై మహేష్ కుటుంబం నుంచిగానీ, హీరో అని చెబుతున్న సందీప్‌కిషన్ నుంచిగానీ ప్రకటన రాలేదు.

# తల్లీ కూతుళ్ల సోకులు

ఒకప్పుడు తెలుగు, తమిళ సినీరంగాలను ఏలిన మహారాణి ఆమె. తన పదహారేళ్ల వయసులోనే తన అందచందాలతో ప్రేక్షకుల మనసులను మెలిపెట్టేసిన అతిలోకసుందరి ఆమె.. ఇపుడు 50 ఏళ్లు దాటినా.. ఇంకా సరిరారు నాకెవ్వరూ అంటోంది.. ఆ సుందరి ఇంకెవరో కాదు.. అలనాటి హీరోయిన్ శ్రీదేవి. ఇపుడు తన కుమార్తెను బాలీవుడ్‌కి పరిచయం చేయాలని భావిస్తున్న ఆమె కూతురితోనూ అందంలో పోటీ పడుతోంది. అంతేకాదు.. .దీపావళి బాణసంచా తళుకులు సైతం ఆ తల్లీ కూతుళ్ల సోకులముందు వెలవెలబోయేలా ఉన్నాయన్నారు.





# గుడి కట్టేస్తున్నారు

సినీ తారలను అభిమానించటం తప్పేంకాదు.. ఈ విషయంలో ఎవరి అభిప్రాయాలు వారివి. తమ అభిమాన తారలకు గుడి కూడ కట్టించేవరకు వెళ్లింది.. అందులోనూ హీరోయిన్లకు గుడి కట్టించటం అన్నది ఇక్కడ మరింత ఆశ్చర్యం కలిగించే విషయం. ఖుష్బూ, సిమ్రాన్, నమిత, నయనతార, హన్సిక- ఇలా అరవ అభిమానులు గుళ్ల కటించిన హీరోయిన్ల జాబితా కొంచెం పెద్దగానే ఉంది. ఆ జాబితాలోకి ఇపుడు కొత్తగా చేరుతున్న పేరు.. కీర్తి సురేష్. రెండేళ్ల కిందటే కథనాయికగా తమిళ ప్రేక్షకులకు పరిచయమైన కీర్తి ధనుష్‌తో చేసిన 'తొడారి' ఆడకపోయినా తాజాగా శివ కార్తికేయన్‌తో చేసిన మరో సినిమా 'రెమో' హిట్టయింది. ప్రస్తుతం విజయ్ లాంటి సూపర్ స్టార్‌తో భైరవ' చేస్తోంది కీర్తి. ఇంకా ఆమె చేతిలో మరికొన్ని క్రేజీ ప్రాజెక్టులున్నాయి. అందం, అభినయం రెండూ ఉన్న కీర్తికి అపుడే భారీగా అభిమానులు తయారయ్యారు. వాళ్లలో కొందరు ఆమెకు తమిళనాట గుడి కట్టించటానికి రెడీ అయిపోతున్నారు. త్వరలోనే విగ్రహం తయారీ పనులు ఆరంభం కానున్నాయి.

కె.సురేష్ బాబు




6 నవంబరు 2016

## విషయ విశేషం



## మంచి ముత్యాలు

ఎవరైనా సరే చేసే పనిని ప్రేమించాలి. అప్పుడు ఎటువంటి మోటు శ్రమైనా సృజనాత్మక స్థాయికి చేరుతుంది.

-ఎమ్.గోర్కి




## లేఖలు

### ఎంతో తెలుసుకోగలిగాం..

అక్టోబరు 23 వార్త ఆదివారం అనుబంధంలో 'అనిమిషుల్ని చేసే యానిమేషన్' కవర్‌స్టోరీ ఎన్నో ఆసక్తికర అంశాలు తెలియజేసింది.యానిమేషన్ పుట్టుపూర్వోత్తరాల గురించి, క్రమంగా వస్తున్న కొత్త పోకడగల గురించి, యానిమేషన్ రంగంలో పిన్న వయసులో సిఇఒ అయిన సింధూజ గురించి తెలియని విషయాలు తెలుసుకోగలిగాం. విజ్ఞానదాయకమైన కవర్‌స్టోరీ నందించిన మీకు మా ధన్యవాదాలు.

-డి.సాగర్, హైదరాబాద్; పి.శ్రీరామ్, విజయవాడ; కె.కార్తీక్, కడప.

### రేడియో విన్నరోజులు గుర్తుకొచ్చాయి..

అక్టోబరు 23 వార్త ఆదివారం అనుబంధంలో 'భావవీచిక'లో ఆసుపత్రులలో కరువైన భద్రత అంశం అందరినీ అప్రమత్తం చేసేదిగా ఉంది. 'సంఘీభావం'లో ఉటంకించినట్లు ఆకలిరహిత భారతం రావాలన్న దిశగా సమిష్టి కృషి సాగించాలి. చిన్నక్క గురించిన ఆర్టికల్ మా జ్ఞాపకాలను తిరగదోడి, అప్పట్లో రేడియో విన్న రోజుల్ని గుర్తుకుతెచ్చింది. కార్మికుల కార్యక్రమం లో అందర్నీ అలరించిన చిన్నక్కగారి పేరు రతన్‌ప్రసాద్ అని తెలుసుకున్నాం. కార్ట్యూన్స్ నవ్విం చాయి. యానిమేషన్ కవర్ స్టోరీ విశ్లేషణాత్మకంగా ఉంది. హలో ఫ్రెండ్‌లో బీడుభూముల గురించి తెలుసుకోగలిగాం. 'ఆ జ్ఞాపకాల గోడ' కవిత బాగుంది. కవి అశోక్ అవారికి అభినందనలు.'వాస్తు వార్త'లో సింహద్వార ప్రాధాన్యం గురించి తెలియజేసినందుకు ధన్యవాదాలు.

-నేమాన సుభాష్‌చంద్రబోస్; పక్కి రాధాగోపాలకృష్ణ,విశాఖపట్నం.

### ఆకలి సూచీలో అడుగున భారత్...బాధాకరం

అక్టోబరు 23 వార్త ఆదివారం అనుబంధంలో 'భావవీచిక'లో నేడు ఆసుపత్రుల్లో కరువైన భద్రత గురించి ఎంతో బాగా తెలియజేశారు. 'అనిమిషుల్ని చేసే యానిమేషన్'లో విషయాన్ని చక్కగా వివరించారు. 'దేశంలోనే ఏకైక మహిళా కమాండో ట్రెయినర్' గురించిన ఆర్టికల్ ఎన్నో కొంత్త సంగతుల్ని తెలియజేసింది. 'సంఘీభావం'లో ఆకలిసూచీలో భారత్ అడుగున ఉన్నదని చదివి ఎంతో విచారించాం. ఆకలిరహిత భారత్ ఎప్పుడు అవతరిస్తుందో!

-అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం, కూకట్‌పల్లి.

### కథ బాగుంది

అక్టోబరు 23 వార్త ఆదివారం అనుబంధంలో 'ఈజన్మకిది చాలు' కథ బాగుంది. అయితే శ్రీకర్ లాటివాళ్లు ఎందరుంటారు? తేజస్విని పాత్రను చక్కగా తీర్చిదిద్దిన రచయితకు అభినందనలు.

-ఎస్.సహజ, వరంగల్.

## భావ వీచిక



### అచట తగుల'బడు'లు!

'బడే గుడి, గురువే దైవం' ఇది భారతీయుల భావన. బాలలను విద్యా వంతులుగా, విజ్ఞానవంతులుగా తీర్చి దిద్దే బడులను గుడులంత పవిత్రంగా కాపాడు కోవాలి. కానీ కల్లోల కాశ్మీరంలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంది. తాజాగా ముష్కరుల దృష్టి పాఠశాలలపై పడింది. అల్లర్ల కారణంగా మూతపడిన పాఠశాలలు అక్టోబరు మొదటివారంలో తెరుచుకున్నాయి. ఆ తర్వాత జరిగిన పరిణామాలలో పాఠశాలలు హఠాత్తుగా అగ్నికీలలకు ఆహుతవుతున్నాయి. ఎంతటి దారుణం! అనంత్‌నాగ్ జిల్లాలోని బట్‌గండ్ 2002లో స్థాపించిన ఇక్రా పబ్లిక్ స్కూల్ ఒకటి. దిల్‌దార్ అహ్మద్ భట్ ఈ స్కూలును స్థాపించాడు. బుర్హన్ వాని హత్యానంతరం స్కూల్‌ను 14 రోజులపాటు మూసేశామని, ఆతర్వాత ట్యూషన్ సెంటర్‌ను కొన సాగించగా, అక్కడ చదువుకునే 200మంది విద్యార్థులేకాక ప్రభుత్వ పాఠశాల విద్యార్థులు కూడా తరగతులకు హాజరయ్యారంటూ, 'ఇప్పుడిక వారు ఏ బడికీ వెళ్లలేరు. వారి భవిష్యత్తుకిది గొడ్డలిపెట్టే' అన్నాడాయన. 'పరీక్షలకు విద్యార్థులను తయారుచేయడమే నేరమైంది' అని విచారించాడు మరో టీచర్. విద్యాలయం ఏర్పాటుచేయడం ద్వారా ఆ మారుమూలపల్లెను ఎంతగానో మార్చాలను కున్న భట్ ఆశలు అడియాసలు కావడంతో ఆయన వ్యధకు అంతే లేదు. ఏ రాజకీయాలు, ఏ మతాలు ఎలా ఉన్నా పాఠశాలలను దహనం చేయడం క్షమార్హం కానేకాదు. చదువు భిక్షను పెట్టే పాఠశాల లను తగలబెట్టడంతో సాధించేదేమిటో! ఎన్నో పాఠశాలలు అగ్నికి ఆహుతి కావడమంటే ఎంతటి బాధాకరమైన విషయం. దీనికి కారకులెవరన్నది పోలీసులు ఇంకా తేల్చ లేదు. ఈ నేపథ్యంలో వేర్పాటు వాదులకు, ప్రభుత్వానికి మధ్య మాటల యుద్ధం నడిచింది. స్థానిక విద్యావేత్త బషీర్ అహ్మద్ దార్ మాట్లాడుతూ 'ఇదొక మాయని మచ్చ, పాఠశాల భవంతులను పునర్నిర్మించ వచ్చేమో కానీ విద్యాసంస్థలు, రాజకీయాలకు అతీతంగా పవిత్రంగా ఉండాలన్న భావనకు విఘాతం ఏర్పడింది' అన్నారు. ఆ మాటలో ఎంతో నిజం ఉంది. అయినా ఈ దారుణ పరిస్థితులలో అక్కడి పిల్లల చదువులు సాగేదెలా? భావితరానికి జరుగుతోన్న ద్రోహాన్ని అడ్డుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## ఈ వారం కార్టూన్స్


వాడి కి లెక్కలు చెప్పలేక అట్లా జుట్టు పీక్కునే బదులు మంచి ట్యూషన్ పెట్టించచ్చు గా !
శేషచంద్ర


ఒబిసిటీ వార్డు
IN
మన కోసమే దిమ్మెలు కట్టించి నట్లుంది !
శేషచంద్ర


దీన్ని నమ్ముతారంటావా ?
2016
2015
గోవిందా లిమిటెడ్
శేషచంద్ర

'సంఘీ'భావం



# ఇదెక్కడి న్యాయం!?

దేశంలోని అన్ని కారాగారాలు సామర్థ్యానికి మించి ఖైదీలతో కిక్కిరిసిపోవడం ఆందోళనకర అంశంగా మారింది. ముఖ్యంగా జైళ్లన్నీ కిక్కిరిసిపోవడానికి ప్రధాన కారణంగా నిలిచిన అండర్ ట్రయల్స్ సమస్యను న్యాయవ్యవస్థ, జైళ్ల వ్యవస్థ పరిష్కరించలేకపోతున్నది. అండర్ ట్రయల్స్‌ను త్వరితగతిన విచారించి తీర్పులు ఇవ్వలేకపోవడంతో వారు చేసిన నేరానికి మించి శిక్షను అనుభవిస్తున్నారు. ఇది న్యాయానికే అన్యాయమని దేశవ్యాప్తంగా మానవహక్కుల ఉద్యమకారులు ఎప్పటినుంచో ఆందోళన చేస్తున్నారు. సకాలంలో న్యాయం అందకపోవడంకూడా న్యాయాన్ని ఇవ్వకపోవడమేనని వారంతా ఉద్యమిస్తున్నా స్పందించేవారు కరువైపోయారు. సాక్షాత్తు సుప్రీం కోర్టే ఇటీవల న్యాయమూర్తులను నియమించకపోతే న్యాయస్థానాలకు తాళాలు వేసుకోవలసిందేనని ధర్మాగ్రహం వ్యక్తం చేసిందంటే మిగతా విభాగాల్లో ఖాళీల భర్తీ ఎంత ఆందోళనకరంగా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు. దేశంలో మొత్తమ్మీద 1401 కారాగాలుంటే అందులో సామర్థ్యం ప్రకారం 3,70,000 వేలమంది ఖైదీలు మాత్రమే ఉండాలి. కానీ ఇప్పుడు దేశమంతటా 4,20,000 ల మంది ఖైదీలు జైళ్లల్లో కుక్కిన పేనుల్లా నలిగిపోతున్నారు. ఇందులో 65 శాతందాకా విచారణలో వున్న ఖైదీలే అంటే అండర్ ట్రయల్సే ఉన్నారు. మొత్తంగా శిక్షపడిన వారు 35 శాతం కూడా లేరంటే జైళ్లు ఎంత వత్తిడితో ఉన్నాయో విశదీకరించనక్కరలేదు. అండర్ ట్రయల్స్ ఎక్కువగా ఉన్న దేశాల్లో ప్రపంచంలో భారత్ స్థానం 18వది అంటే మన పరిస్థితి ఎలా ఉందో అంచనాకు రావచ్చు. మొత్తం ఖైదీలు జైళ్లల్లో పరిమితికి మించి 115 శాతందాకా వున్నారు. ఇలాంటి కిక్కిరిసిన పరిస్థితుల్లో వారి ఆహారం, వసతి, వైద్యం ఎలా ఉంటుందో తలచుకుంటేనే భయమేస్తుంది. ఇప్పటికే అనేక జైళ్లల్లో శిక్షపడిన ఖైదీలు అండర్ ట్రయల్స్ అనుమానాస్పద పరిస్థితుల్లో మరణిస్తున్నారు. వారి మరణాలకు కారణాలేమిటో తెలియడంలేదు. వైద్యం కూడా సరిగా అందడం లేదు. నిజానికి జైళ్లు సంస్కరణలకు కేంద్రాలుగా ఉండాలి. కానీ ఇక్కడికి తెలిసో తెలియకో వచ్చే ఖైదీలు నరకాన్ని చవిచూస్తున్నారు. జైలుకు వచ్చినవారిని సరైన మానసిక సలహాలతో వారిని సంస్కరించే మానసిక వైద్యులు తప్పనిసరిగా ఉండాలి. కానీ దేశంలోని అన్ని జైళ్లల్లో కలిపి 18 మంది కూడా మానసిక వైద్యులు లేరు. అంటే 23000 వేల మంది ఖైదీలకు ఒక మానసిక వైద్యుడు మాత్రమే ఉన్నాడు.

ఇలాంటి పరిస్థితుల్లో జైళ్లల్లో ఖైదీలను మానసికంగా ఎలా సంస్కరిస్తారో పాలకులు అర్థం చేసుకోవాలి. ఇక జైళ్లను నిర్వహించే ఉద్యోగులు, సిబ్బంది గురించి విశ్లేషిస్తే మొత్తం కారాగారాల్లో ఉండాల్సినవారు 80,000 మంది అయితే సగం మంది కూడా విధుల్లో లేరు. దీనివల్ల నిర్వహణ అధ్వాన్నంగా మారుతోంది. కరడుగట్టిన క్రిమినల్స్ పారిపోవడానికి సిబ్బంది కొరత కూడా ప్రధాన కారణంగా నిలుస్తున్నది. ఇక అండర్ ట్రయల్స్ విచారణ ఏళ్ల తరబడి సాగడంతో కొందరు నేరాన్ని మించి శిక్షను తీర్పు లేకుండానే అనుభవిస్తున్నారు. ప్రతి నలుగురిలో ఒక అండర్ ట్రయల్ ఏడాదికి మించి జైళ్లలోనే మగ్గుతున్నారు. కల్లోలిత జమ్మూ-కాశ్మీర్ జైళ్లలో అయిదేళ్లకుమించి జైళ్లలో ఉన్న అండర్ ట్రయల్స్ 50శాతానికి మించింది అంటే అక్కడ న్యాయంతీరు ఏమిటో వెల్లడవుతోంది. దేశవ్యాప్తంగా 3 కోట్లకు పైగా కేసులు పెండింగ్‌లో ఉన్నాయంటే మన దేశంలో న్యాయవ్యవస్థ తీరు ఎలా ఉందో చెప్పకనే గణాంకాలు చెప్తున్నాయి. నేరాల విచారణ దశాబ్దాల తరబడి సాగడం, తీర్పు సమయానికి సాక్ష్యాలు, సాక్షులు తారుమారు కావడంతో శిక్షపడేవారి శాతం కూడా తగ్గుతున్నది. అసలు నేరం చేస్తే శిక్ష పడేది ఎప్పుడో కదా! అంటూ నేరాలకు తెగబడేవారి సంఖ్య రోజురోజుకు పెరుగుతున్నది. దేశంలో దాద్రానగర్‌లో 276 శాతం, ఢిల్లీలో 226 శాతం, ఛత్తీస్‌గడ్‌లో 233 శాతం, మేఘాలయలో 177 శాతం, ఉత్తరప్రదేశ్‌లో 170 శాతం ఖైదీలతో జైళ్లు రద్దీగా మారిపోయాయి. అండర్ ట్రయల్స్‌ను వీలయినంత త్వరగా విచారించి శిక్షించే విధానాలు ముఖ్యంగా టెక్నాలజీని అందుబాట్లోకి తేవడం ఇక్కడ ఆలస్యమవుతున్నది. అలాగే జైళ్లకు వచ్చేవారికి సకాలంలో వైద్యం, సరైన ఆహారం అందడం కష్టసాధ్యంగా మారుతున్నది. ఫలితంగా శిక్ష పడేలోపే నేరం నిరూపితమయ్యేలోపే ఖైదీలు అనుమానాస్పదంగా మరణిస్తున్నారు. దీనిపై విచారణ జరిగినా అసలు తప్పు ఎవరిదో తేలని పరిస్థితి ఉంది. అందుకే జైళ్లల్లో ఖైదీల అనుమానాస్పద మరణాలు కూడా ఇటీవల కాలంలో చర్చనీయాంశంగా మారాయి. పాలకులు మొత్తం న్యాయవ్యవస్థపై ప్రజల్లో విశ్వాసం ఏర్పడేలా సంస్కరణలు తేలేకపోతున్నారు. టెక్నాలజీని న్యాయవ్యవస్థకు అనుసంధానం చేయలేకపోతున్నారు. అది సివిల్ కేసైనా, క్రిమినల్ కేసైనా ఎఫ్ఐఆర్ నుంచి తీర్పు ఇవ్వడంవరకు నిర్దిష్ట కాలపరిమితిని నిర్ణయించే దిశగా సంస్కరణలు సాగడంలేదు. ఇందుకు మార్గదర్శకంగా అనేక దేశాలు నిలుస్తున్నాయి. అక్కడ పరిస్థితులను కూడా అధ్యయనం చేసేవారు కరువయ్యారు.

వివిధ దేశాల్లో ప్రజలు నేరాలు చేయాలంటే భయపడానికి కారణం అక్కడ పటిష్ట పోలీసు, న్యాయవ్యవస్థ ఉండడమే. అక్కడ నేరం జరిగితే వెంటనే పట్టించే నిఘా వ్యవస్థ పని చేస్తుంది. కానీ ఇక్కడ ఏ నేరం జరిగినా సరైన ఆధారాలు సేకరించే నిఘా వ్యవస్థ లేకపోవడం, ఉన్నా సాక్షులను, సాక్ష్యాలను తారుమారు చేసే అవినీతి అడుగడుగునా చోటు చేసుకోవడంతో న్యాయవ్యవస్థలో పెండింగ్ కేసులు పెరిగిపోతున్నాయి. ముందుగా జైళ్లను రద్దీరహితం చేయాలంటే అండర్ ట్రయల్స్‌ని జైళ్లనుంచి విచారించే వీడియో విచారణను అన్ని స్థాయిల కోర్టులు తక్షణమే చేపట్టాలి. ముందుగా అండర్ ట్రయల్స్ చేసిన నేరాల స్థితితోపాటు వాటి విచారణకు నిర్దిష్ట కాలపరిమితిని నిర్ణయించి ఆ మేరకు న్యాయమూర్తులకు ఆదేశాలివ్వాలి. అప్పటిలోగా కేసువిచారణ పూర్తి కాకుంటే అండర్ ట్రయల్స్‌ను జైళ్లనుంచి విముక్తి చేయాలి. అలాగే జైళ్లలో నివసించడానికి అనువైన మానవీయ మౌలిక పరిస్థితులను కల్పించాలి. జైళ్లనేవి సంస్కరణ కేంద్రాలుగా ఉండాలి తప్ప శిక్షించే కేంద్రాలుగా మారకూడదు. న్యాయ వ్యవస్థను పట్టిపీడిస్తున్న సమస్యలను, క్షేత్ర పరిస్థితులను క్షుణ్ణంగా అధ్యయనం చేసి తెలుసుకుని తదనుగుణంగా దిద్దుబాటు చర్యలు తీసుకుంటే తప్ప న్యాయం జరగదు.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




– ఎ.వి.వి. ప్రసాద్

# ములాయం పరి'వార్'!

**పదవి మోజులోన ఫ్యామిలీ మెంబర్లు**
**పిల్లిమొగ్గలేవొ వేయుచుండె;**
**ఇడుములందు చిక్కె ఎస్పినేత ములాయం**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

**ఎస్పీలో ములాయంనుగాని, ముఖ్యమంత్రిగా ఉన్న అఖిలేష్‌ను గాని కాదని అధికారం చెలాయించగలిగిన వారెవరూ లేరు. పార్టీలో చీలిక తెచ్చినా దానివల్ల ఎలాంటి ఎన్నికల ప్రయోజనమూ ఉండదు. ములాయం, అఖిలేష్ ఎదురుగా నిలబడితేనే యాదవుల ఓట్లు లభిస్తాయిగాని, శివపాల్ యాదవ్‌నో, రాంగోపాల్ యాదవ్‌నో చూసి ఓట్లు వేసేవారు ఎవరూ ఉండరు. ఇటువంటి పరిస్థితిలో పార్టీలో చీలిక వస్తుందంటే అది నమ్మశక్యంగాని విషయమే. అమర్‌సింగ్‌ను తిరిగి రప్పించింది కూడా పార్టీని మరింత బలోపేతం చేయడానికే. ములాయం, అఖిలేష్‌లను ఢిల్లీలోను, రాష్ట్రంలోను పదవుల్లో నిలుపడమొక్కటే అమర్ లక్ష్యమైనపుడు పార్టీలో చీలిక వచ్చే అవకాశమే లేదనిపిస్తుంది. కేబినెట్ నుంచి కొందరిని తొలగించడం దానిలో భాగమే కావచ్చు. ఆనువంశిక పాలనలో ములాయం అందె వేసిన చేయి అని ఆయన వ్యూహాలను బట్టి చెప్పవచ్చు.**

రాజకీయ కుటుంబాలు రోడ్డెక్కడం మామూలే. సాగినంతకాలం తమంతవారు లేరనడం, సాగకపోతే ఒకరిపై ఒకరు ఆరోపణలు చేసుకొంటూ, ఒకరి లొసగులు మరొకరు బయట పెట్టుకొంటూ రోడ్డున పడడమూ మామూలే. ఆ వరుసలో ఇప్పుడు యుపిలోని ములాయం కుటుంబం కూడా చేరింది. రాజకీయాలలో ఒక స్థాయికి చేరిన నేత తానే ఒక పార్టీని స్థాపించి ప్రజలకు 'సేవ' చేయాలనుకోవడం తప్పుగాకపోయినా, ఆ పార్టీ నీడలో తన కుటుంబమేగాక తన బంధుజనం, ఆశ్రిత గణమంతా తరించాలనుకోవడం కొంత అత్యాశే అవుతుంది. ఆ పరంపరలో అనేకమంది పార్టీలో ప్రవేశించడం, వారిలో కొందరు అధిష్ఠాన నేతలకే ఎసరు పెట్టాలనుకోవడం జరుగుతూంటుంది. ఆ దశలోనే పార్టీలు రోడ్డున పడుతూంటాయి. వాటిలో కొన్ని తిరిగి కోలుకొంటాయి,మరికొన్ని క్రమంగా అంతరించి పోతాయి. దీనంతటికి ప్రధానకారణం అధికార దాహమే. సమాజ్‌వాది పార్టీ (ఎస్పీ) పాతికేళ్ల క్రితం ఏర్పాటయినప్పుడు దానిలో 'కింగ్' ములాయం సింగ్ యాదవ్ ఒక్కరే. కాని ఇప్పుడు ఆ పార్టీ అనేక పరిణామాలు చెంది కింగ్ ఎవరో, కింగ్ మేకర్ ఎవరో అర్థంకాని అయోమయ పరిస్థితిలోకి జారిపోతోంది. పాత్రధారులు, గాత్రధారులు పెరిగిపోవడంతో ఎవరి 'పాత్ర' ఏమిటో, ఎవరి అభినయం ఎందుకో తెలియని విచిత్రమైన వాతావరణం కనిపిస్తోంది.



కుమారుడు అఖిలేష్‌ను ఉత్తర ప్రదేశ్ రాజకీయ యవనిక పైకి తెచ్చింది ములాయమే. ఇప్పుడు ఆయనే 'సిఎం కుర్చీలో కూర్చొనడానికి నీ సామర్థ్యమేమిటి?' అని అఖిలేష్‌ను ప్రశ్నిస్తున్నారు. అఖిలేష్ సామర్థ్యమేమిటో తెలియకుండానే ఆయన్ని ముఖ్యమంత్రి సీట్లో ములాయం కూర్చోబెట్టారని అనుకోగలమా! కుటుంబంలోని సభ్యులకే గాక ఆ సభ్యుల అనుంగు మిత్రులకు, బంధువులకుకూడా పెద్దపెద్ద పదవులే ఇచ్చేశారు. ఇప్పుడు వారందరు తమ హోదాలను 'సద్వినియోగం' చేసుకొంటుండగా హఠాత్తుగా జ్ఞానోదయమై కొందరిని ఆ స్థానాలనుండి తప్పించారు. దానితో 'కుంపటి' రగలడం ఆరంభమైంది. 'అబ్బే! అదేం లేదు. అంతా కలిసే ఉన్నాం' అంటూనే ఒకరిపై ఒకరు కత్తులు దూసుకోవడం చూస్తూంటే యుపిలోని అతిపెద్ద పార్టీ వచ్చే ఎన్నికల్లో నిజంగా తన సత్తా మరోసారి చాటగలదా? అనే సందేహం కలుగుతుంది. ఇది పైకి కనిపిస్తున్న విషయం. అయితే అదొక వ్యూహంలో భాగమా? లేక నిజంగానే కలహించుకొంటున్నారా? అనే సందేహం కూడా కలుగుతోంది. ఎందుకంటే ఎన్నికలకు ఇక ఆరునెలల దూరం కూడా లేని సమయంలో తెలివైన ఏ నాయకుడైనా కలహాలతో రోడ్డెక్కుతాడా? ఎక్కకపోవచ్చు. పార్టీని మరింత పటిష్టం చేసుకొనడానికి, తమమధ్య విభేదాలులేవు, నిజంగా అంతా కలిసే ఉన్నామని చెప్పడానికి రూపొందించిన వ్యూహమూ కావొచ్చు. లేక నిజంగానే కలహించుకొంటే అంతలోనే సయోధ్య కుదిరి తాము మరింత సమైక్యంగా ఉన్నామని చెప్పడానికీ కావొచ్చు.

తమను తిరిగి ఎన్నుకొంటే తమ 'పరివారం'తో రాష్ట్రాన్ని మరి కొన్నేళ్లపాటు ఏలుకొంటామని చెప్పడానికీ కావొచ్చు. ఏది ఏమైనా ములాయం పరి'వార్' మాత్రం యుపిలో ప్రస్తుతం రాజకీయ లెక్కలను మార్చివేస్తోంది. అసెంబ్లీ ఎన్నికలకు పదునైన వ్యూహాలను రూపొందించే క్రమంలో ఎస్పీతో ఎపాటు దాని ప్రధాన ప్రత్యర్థులైన బిఎస్పీ, కాంగ్రెస్, బిజెపిలు కూడా తమ వ్యూహాలను మార్చుకొనే పనిలో పడ్డాయి. ఎస్పీలో అధినాయకులంతా కలసి ఉంటే ప్రత్యర్థుల వ్యూహం ఒకలా ఉంటుంది. వేర్పడితే మరోలా ఉంటుంది. కానీ ఎస్పీలోని అధినాయకులంతా ఇప్పుడు కలసి ఉన్నారో, లేదో స్పష్టంగా చెప్పలేని పరిస్థితే నెలకొని ఉండడంతో తాము ఎటువంటి వ్యూహం రూపొందించుకోవాలో తెలియని అయోమయంలో ప్రతిపక్షాలు కొట్టుమిట్టాడుతున్నాయి. బహుశా ఎస్పీ రాజకీయ వ్యూహంలో ఇదొక భాగమై ఉండవచ్చు. ఎందుకంటే ఆ పార్టీలో ములాయం గీచిన గీతదాటే 'దమ్ము' ఎవరికి ఉందని అనుకోగలం! ఆమధ్య డిఎంకె పార్టీలో కూడా ఇటువంటి 'హైడ్రామా'నే ప్రజలు చూశారు. తమిళనాట పలుమార్లు రాజ్యమేలిన ప్రధాన 'రాజకీయ కుటుంబం'గా డిఎంకె పేరు సుస్థిరమే అయినా కుటుంబంలో ఏవో కలహాలున్నాయంటూ స్టాలిన్, అళగిరి, దయానిధి వంటివారు ఆమధ్య రోడ్డెక్కి కొంత సంచలనం సృష్టించారు. ఎన్నికల ముందు వారుచేసిన 'హడావుడి' వల్ల పార్టీ తేలికగా విజయం సాధించి మళ్లీ అధికారంలోకి రాగలమనుకొన్నారు. అయితే కొద్దితేడాలో జయలలిత నాయకత్వంలోని అన్నాడిఎంకె అధికారంలోకి వచ్చింది. అది వేరే విషయం. ప్రస్తుతం ఎస్పీ 'హైడ్రామా'ను పరిశీలిస్తే వచ్చే ఎన్నికల్లో కుమారుడు అఖిలేష్‌ను మరోసారి సిఎం పీఠంపై అధిష్ఠింపచేసేందుకు ములాయం స్వయంగా ఈ పరి'వార్'కు రూపకల్పన చేసి ఉంటారని అనుమానమే కలుగుతుంది. అఖిలేష్ పార్టీలో కొంత బలహీన పడ్డాడనే అభిప్రాయం పలువురి నుండి వినిపించడంతో, అతడి స్థానాన్ని పదిలం చేయడానికే ములాయం ఈ 'ముసలం' వ్యూహాన్ని సృష్టించారని పిస్తుంది. కత్తులు దూయడం, ఆరోపణలు చేసుకోవడం వల్ల తొలుత ఏవో విభేదాలు ఉన్నట్లు కనిపించినా తర్వాత అవి సర్దుమణిగాయని చెప్పడం, అంతా కలిసే ఉన్నామని ప్రకటించడం వల్ల ప్రజలలో పార్టీ పట్ల విశ్వాసం మరింత పెరగవచ్చనే అంచనాతో వ్యూహం రూపొందించి ఉండవచ్చనే అభిప్రాయం కూడా కలుగుతుంది.

**********

ఉత్తరప్రదేశ్‌లో ములాయం సింగ్‌ది నిజానికి చాలా పెద్ద రాజకీయ కుటుంబమే. ఎస్పీకి ఆయన జాతీయ అధ్యక్షుడు, లోక్‌సభ సభ్యుడు కాగా, కుమారుడు ముఖ్యమంత్రి. రెండునెలల క్రితం అఖిలేష్‌ను పార్టీ రాష్ట్ర అధ్యక్ష పదవి నుంచి తప్పించి ఆ పదవిని తమ్ముడైన శివపాల్ యాదవ్‌కు ములాయం అప్పగించారు. తాజా విభేదాలు అప్పటినుంచే మొదలైనట్లుగా కనిపిస్తాయి. కేబినెట్‌లో ఉన్న శివపాల్‌తో అఖిలేష్ విభేదించడంవల్లే కుటుంబంలో లుకలుకలు ఆరంభమైనా వారెవరూ బయటివారు కాదుగనుక ఆ కలహాలన్నీ ఉత్తుత్తువేననే అనుమానం కలుగుతుంది. ఈ మధ్యలో అమర్‌సింగ్ 'కలహాల నాటకా'న్ని మరింత రక్తికట్టించే విధంగా వ్యవహరిస్తూ అందరి దృష్టి ఎస్పీపైనే పడేట్లు చేస్తున్నారు. ములాయం దాయాది సోదరుడు రాం గోపాల్ యాదవ్, ములాయం చిన్న భార్య సాధనా గుప్తా, ఇంకా డింపుల్ యాదవ్, తేజ్ ప్రతాప్ సింగ్ యాదవ్, ధర్మేంద్ర యాదవ్, అక్షయ్ యాదవ్..ఇలా దాదాపు 16మంది 'కుటుంబ నాయకులు' ఎస్పీ తాజా 'హైడ్రామా'లో ఎవరి పాత్రలను వారు రక్తికట్టిస్తున్నారు. ఇందరు నాయకులు ఏలుతున్న రాజకీయ కుటుంబంకూడా బహుశా ములాయం ఒక్కరిదే. వారిలో ములాయంకు చిరకాలమిత్రుడు, పార్టీ నిర్ణయాలలో ప్రధాన పాత్రధారి అయిన అమర్‌సింగ్ ఒకప్పుడు పార్టీనుంచి బహిష్కృతుడై, సొంతకుంపటి పెట్టుకొని మళ్లీ ఎస్పీలోకి ప్రవేశించారు. ప్రస్తుతం పార్టీలో ఆయన హవానే నడుస్తున్నట్లు పార్టీ వర్గాల కథనం. 'అమర్‌సింగ్ నా సోదర సమానుడు. ఆయన లేకుంటే నేను జైలుకు వెళ్లి ఉండేవాడిని' అని ఇటీవల ఒక సందర్భంలో ములాయం అన్నమాటలు చాలు- పార్టీలో అమర్‌సింగ్ పాత్ర ఏమిటో చెప్పడానికి. 2019 ఎన్నికల్లో ములాయంను ప్రధాన రేస్‌లో ముందు నిలపడానికి అమర్ వ్యూహం రూపొందిస్తున్నారనీ, ఆ క్రమంలోనే, రాష్ట్రంలో అఖిలేష్ స్థానాన్ని సుస్థిరం చేయడానికి వచ్చే అసెంబ్లీ ఎన్నికలోల ఆయన్ని మరోసారి ముఖ్యమంత్రిని చేయడానికి అమర్ వ్యూహం రూపొందించారనీ, ఆ వ్యూహంలో భాగంగానే 'కలహాల కథ' నడిపిస్తున్నారనీ తెలుస్తోంది.



ఉత్తరప్రదేశ్‌ను 'ఉత్తమ ప్రదేశ్'గా మార్చుతానంటూ ప్రధాని మోడీ ఇటీవల బిజెపి స్థానబలం పెంచే దిశగా ప్రయత్నాలు చేస్తుండడంతో దానిని ఎదుర్కొనడానికి ఎస్పీ కొత్త వ్యూహం రచించిందనీ, దానిలో భాగంగానే ఈ 'హైడ్రామా' నడుస్తున్నదనీ విశ్లేషకులు భావిస్తున్నారు కొద్దిరోజులుగా నడుస్తున్న కీచులాటల ఫలితంగా రాష్ట్రంలో అఖిలేష్ యాదవ్ మరింత బలపడినట్లుగా రెండుసర్వేలలో తేలిన విషయాన్ని బట్టి చూస్తే కలహాల కథ అంతా ఎన్నికల వ్యూహమే అనిపిస్తుంది. యాదవుల్లో 61 శాతం మంది, ముస్లింలలో 78శాతంమంది అఖిలేష్ నాయకత్వాన్నే బలపరుస్తున్నారనీ, వచ్చే ఎన్నికల్లో కూడా ఎస్పీకే విజయావకాశాలు ఉన్నాయనీ సి-ఓటర్ సర్వేలో తేలిన విషయం 'హైడ్రామా' వెనుకగలవ్యూహాన్ని స్పష్టంచేస్తున్నదనే చెప్పాలి. ఎస్పీలో ములాయంనుగాని, ముఖ్యమంత్రిగా ఉన్న అఖిలేష్‌ను గాని కాదని అధికారం చెలాయించగలిగిన వారెవరూ లేరు. పార్టీలో చీలిక తెచ్చినా దానివల్ల ఎలాంటి ఎన్నికల ప్రయోజనమూ ఉండదు. ములాయం, అఖిలేష్ ఎదురుగా నిలబడితేననే యాదవుల ఓట్లు లభిస్తాయిగాని, శివపాల్ యాదవ్‌నో, రాంగోపాల్ యాదవ్‌నో చూసి ఓట్లు వేసేవారు ఎవరూ ఉండరు. ఇటువంటి పరిస్థితిలో పార్టీలో చీలిక వస్తుందంటే అది నమ్మశక్యంగాని విషయమే. అమర్‌సింగ్‌ను తిరిగి రప్పించింది కూడా పార్టీని మరింత బలోపేతం చేయడానికే. ములాయం, అఖిలేష్‌లను ఢిల్లీలోను, రాష్ట్రంలోను పదవుల్లో నిలుపడమొక్కటే అమర్ లక్ష్యమైనపుడు పార్టీలో చీలిక వచ్చే అవకాశమే లేదనిపిస్తుంది. కేబినెట్ నుంచి కొందరిని తొలగించడం దానిలో భాగమే కావచ్చు. అనువంశిక పాలనలో ములాయం అందె వేసిన చేయి అని ఆయన వ్యూహాలను బట్టి చెప్పవచ్చు. పార్టీలోని వివిధ గ్రూపుల మధ్య తన ఆధిపత్యాన్ని పదిలం చేసుకొనడం, అఖిలేష్ మినహా పార్టీలో మరొకరికి సిఎం సీటు సాధ్యంకాదని చెప్పడం- ఈరెండు ఒకేసారి అందరికి తెలిసేట్లు చేయడమే రెండు నెలలపాటు సాగిన 'కలహాల కథ' వెనుక గల అసలు కారణమనిపిస్తుంది.

ఎస్పీబలహీనపడితే ఆమేరకు తొలుత ప్రయోజనం పొంద గలిగేది మాయావతి నాయకత్వంలోని బహుజన్ సమాజ్ పార్టీ (బిఎస్పీ) కావడంతో ఆ అవకాశం ఆ పార్టీకి ములాయం ఎటువంటి పరిస్థితిలోను ఇవ్వబోరనే వాదం కూడా ఉంది. యుపిలో ముస్లింల జనాభా 18శాతం వరకు ఉండడంతో వారి మద్దతు కోసం ఎస్పీ, బిఎస్పీ ఎప్పుడూ పోటీపడుతుంటాయి. ఇప్పుడు బిజెపి కూడా రాష్ట్రంలో బలపడుతూండడంతో పోటీ ప్రధానంగా ఆ మూడు పార్టీల మధ్యనే కొనసాగేట్లు కనిపిస్తోంది. కాంగ్రెస్ ఇప్పటికే రాష్టంలో చాలా బలహీనపడడంతో ఆ పార్టీకి లభించే మైనారిటీ ఓట్లు ప్రత్యామ్నా యంగా ఎస్పీకి లభించే అవకాశం ఉంది. ఎస్పీలో చీలిక వస్తే ఆ ఓట్లు బిఎస్పీకి జారిపోతాయి.. అందువల్ల మైనారిటీ ఓట్లు అధిక శాతం సాధించాలంటే చీలికలు రాకుండా పార్టీని కాపాడు కోవలసిన పెద్దబాధ్యత ములాయంపై ఉండడంతో ఆయనే స్వయంగా ఈ హై డ్రామాను నడిపిస్తున్నారనే అభిప్రాయం కూడా ఉంది. గత లోక్‌సభ ఎన్నికల్లో 'మోడీ హవా' లో యుపిలోని లోక్‌సభ సీట్లలో అధిక శాతం బిజెపి బుట్టలో పడ్డాయి. మొత్తం 80 స్థానాలలో 71 సీట్లను పార్లమెంటు ఎన్నికల్లో బిజెపి సాధించగలిగింది. అయితే అసెంబ్లీ స్థానాలలో ఎస్పీ ప్రభావం ఇంకా కొనసాగుతూండడంతో పార్టీ పటిష్టంగానే ఉన్నదనే అభిప్రాయం ఓటర్లలోకలిగించేందుకు ములాయం కొత్త ఎత్తుగడ రూపొందించి ఉంటారనిపిస్తోంది.

మరో అయిదారు నెలల్లో జరిగే అసెంబ్లీ ఎన్నికల్లో గెలుపుపైనే ఎస్పీ భవిష్యత్తు ఆధారపడి ఉంది. రజతోత్సవాలు జరుపుకొనడానికి సిద్ధంగా ఉన్న పార్టీ చీలిపోయే దిశగా పయనిస్తుందని అనుకోలేము కదా. పైగా రాష్ట్రంలో పార్టీ చీలితే జాతీయ స్థాయిలో చక్రం తిప్పా లనుకొనే ములాయం ఆశలు కూడా ఆవిరైపోతాయి. బీహార్‌లో చేసిన ప్రయోగమే యుపిలోనూ చేసి బిజెపి విజయావకాశాలను దెబ్బతీసే ఆలోచనలో ములాయం ఉన్నారు గనుక- పార్టీలో చీలికకు ఇప్పట్లో అవకాశమే లేదని చెప్పాలి. లాలూ యాదవ్ నాయకత్వంలోని ఆర్జేడి, నితీశ్ నాయకత్వంలోని జెడి (యు), ఎస్పీ, జెడి (ఎస్), ఐఎన్ఎల్‌డి సమైక్యంగా పోటీచేస్తే జాతీయస్థాయిలో బిజెపిని ఎదుర్కొనగలవనే వ్యూహం ఒకటి ఉంది. అయితే జాతీయస్థాయిలో ఈ మహాకూటమి ఏర్పాటుకు కొన్ని సమస్యలెదురవుతూండడంతో అది ఎప్పటికప్పుడు కుంటుతూ నడుస్తోంది. ఆమధ్య జరిగిన బీహార్ ఎన్నికల్లో ఈ 'సంకీర్ణం' ఆశించిన ఫలితాలుసాధించడంతో యుపి అసెంబ్లీ ఎన్నిక ల్లోనూ అలాంటి ప్రయోగమే జరిపేందుకు ములాయం వ్యూహం రూపొందిస్తున్నారు. ఈ పరిస్థితిలో పార్టీలో చీలిక వచ్చే ప్రయత్నాలు ఏమి జరిగినా అవి ఎస్పీ భవిష్యత్తునే ప్రశ్నార్థకం చేస్తాయి గనుక పార్టీలోని 'కలహాల డ్రామా' అంతా చీలికకుగాక పటిష్టానికే రూపొం దించి ఉంటారనిపిస్తుంది. 2012లో యుపి ప్రజలు సమాజ్‌వాదీకి అధికారం కట్టబెట్టినపుడు కుమారుడు అఖిలేష్‌కు ఆయన ప్రభుత్వ పగ్గాలు అప్పగించారు. అఖిలేష్ తొలుత కొన్ని తప్పటడుగులు వేసినా అయిదేళ్ల పాలనను అందరి ఆమోదయోగ్యంగానే నెట్టుకొచ్చారు. అందుకే మళ్లీ ఎస్పీ అధికారంలోకి రావాలన్నదొక్కటే ములాయం - అమర్‌ల ఎత్తుగడగా కనిపిస్తుంది. తాజా కలహాల డ్రామా దానిలో భాగమే అనిపిస్తుంది. అయితే ఈ డ్రామా పార్టీ విజయావకాశాలను ఎంతవరకు మెరుగుపరచగలదో చూడవలసి ఉంది. ■

# ఆ సీట్లు పలికేను కోట్లు!

## మేటి కంపెనీల్లో మెండుగా ప్యాకేజీలు

కవర్ స్టోరీ

గన్ని మోహన్
సీనియర్ రిపోర్టర్, స్టేట్ బ్యూరో.

**జీవితం అనే మాటలోనే జీతం కూడా ఇమిడి ఉంది. జీతం బాగుంటే జీవితం బాగున్నట్లే. ఎందుకంటే హార్థిక సమస్యలన్నిటికి మూలం చాలావరకు ఆర్థిక సమస్యలే. అవి లేని జీవితం ఆనందమయమే కదా. 'ఏం ఉద్యోగాలో ఎంత కష్టపడ్డా జీతం గొర్రె తోక బెత్తెడన్నట్లే ఉంద'ని అధిక సంఖ్యాకులు చింతిస్తుంటే, మరో వైపు ఐటిరంగంలో, వివిధ పరిశ్రమల్లో సిఇఒలుగా, డైరెక్టర్లుగా పనిచేసేవారి జీతాలు కోట్లల్లో ఉండి, 'ఉద్యోగాలంటే అవీ..జీతాలంటే అవి' అని అందరినీ ఊరిస్తున్నాయి. ఒకప్పుడు దేశ ప్రధానుల, రాష్ట్రపతుల జీతభత్యాలే బాప్‌రే అనిపించేవి. కానీ ఇప్పుడు వాటిని మించిన జీతాలు కార్పొరేట్ ఉద్యోగస్థులు అందుకొంటున్నారు. వారి సీట్లు హాట్ సీట్లే కావచ్చు, కానీ జీతాలు కోట్లలో ఉంటే అంతా కూల్ కదా. భారత్‌లోను, విదేశాల్లోనూ వివిధ కంపెనీల్లో ప్రతిభా సంపన్నులైన మహిళా సిఇఒల, సత్తా చాటుతోన్న పురుష సిఇఒల విజయపథాలు, వారి జీతాల వివరాలు.. వగైరా వగైరా ఆసక్తికర విశేషాలు ఈవారం మీకోసం.**

ప్రతిభానైపుణ్యాలకు భారత్‌లో కొదవలేదు. అలాగే అమెరికా, యూరోప్ వంటి అగ్రదేశాల్లో కూడా ప్రతిభాసంపన్నులైన మహిళా శక్తికి కార్పొరేట్ రంగం నీరాజనాలు పలుకుతోంది. భారీ ఎత్తున వేతన ప్యాకేజిలను ఆఫర్‌చేస్తున్నాయి. పెప్సికో ఇంద్రానూయి అయినా, యాహూ మారిస్సా మేయర్ అయినా ఎవ్వరైనా సరే ప్రతిభ ఉన్న ఎవ్వరినీ కూడా వదులు కునేందుకు కార్పొరేట్ యాజమాన్యాలు ఇష్ట పడటంలేదు. భారత్‌లో అరుంధతీ భట్టాచార్య, ఐసిఐసిఐ చందాకొచ్చర్ ఒక్కరేమిటి ప్రతిభా సంపన్నులకు కొదవలేదు. వీరికి అందుతున్న ప్యాకేజిలు కూడా భారీగానే ఉంటున్నాయి. అమెరికాలో పనిచేస్తున్న టాప్ పదిస్థానాలలోని మహిళా సిఇఒలను పరిశీలిస్తే వారికి అందుతున్న వేతన ప్యాకేజిలు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి.



యాహూ సిఇఒ మారిస్సా మేయర్ ఐదోస్థానంలో నిలిచారు. మహిళా సిఇఒల్లో ఆమె నెంబవర్‌వన్ స్థానంలో నిలిచారు. అమెరికాలో అగ్రశ్రేణి కంపెనీలు కూడా ప్రతిభ ఉన్న మహిళా సిఇఒలకు ప్రాధాన్యత ఎక్కువ ఇస్తున్నాయి. డిస్కవరీ కమ్యూనికేషన్స్ సిఇఒ డేవిడ్ జస్లావ్ టాప్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేస్తున్నారు. ఆయన జీత భత్యాలప్యాకేజి 156.1 మిలియన్ డాలర్లుగా ఉంది. ఇక సిబిఎస్ సిఇఒ లెస్లీ మూవ్స్ జీతభత్యాలప్యాకేజి 54.4 మిలియన్ డాలర్లుగా ఉన్నాయి. వీరిద్దరి ప్యాకేజిలే 210 మిలియన్ డాలర్లవరకూ ఉన్నాయి. ఇక పది టాప్ మహిళా సిఇఒల్లో జీత భత్యాలు సగటున 13.1 మిలియన్ డాలర్లుగా ఉంది. డూపాంట్ సిఇఒ ఎల్లెన్ కుల్‌మాన్‌కు ఈ జీతాలు అందుతుంటే యాహూ సిఇఒ మారిస్సా మేయర్‌కు 42.1 మిలియన్ డాలర్లుగా ఉన్నాయి. టాప్ పదిమంది మహిళా సిఇఒల వేతన ప్యాకేజిలో 204 మిలియన్ డాలర్లవరకూ ఉన్నాయి. ఇక అమెరికాలోనే జెఫరీ బ్యాక్స్ అనే సిఇఒ టైమ్ ఆర్నర్‌ఖు పనిచేస్తున్నారు. ఆమె ఎక్కువ వేతనాలు పొందుతున్న పది మంది సిఇఒల్లో ఒకరుగా ఉన్నారు. 32.7 మిలియన్ డాలర్లుగా ఉన్నాయి. అమెరికాలోనే రెండో అతిపెద్ద వేతన ప్యాకేజి పొందుతున్న మహిళా సిఇఒగా నిలిచింది. టిజెఎక్స్‌కు పనిచేస్తున్న కారోల్ మేరోవిట్జ్ 23.3 మిలియన్ డాలర్లు వార్షిక ప్యాకేజితో పని చేస్తున్నారు. రెండేళ్లనాటి వేతనాలతో పోలిస్తే ప్రస్తుతం 21శాతం పెరిగాయి. 15.9 మిలియన్ డాలర్లకు చేరాయి.

వరుసగా చూస్తే డేవిడ్‌జస్లావ్‌కు 156.1 మిలియన్ డాలర్లు, లెస్లీ మూన్వ్‌కు సిబిఎస్‌లో 54.4 మిలియన్ డాలర్లు, ఫిలిప్ డామాన్ వయాకామ్ 44.3 మిలియన్ డాలర్లు, రాబర్ ఐగర్ వాల్ట్ డిస్నీ 43.7 మిలియన్ డాలర్లు, యాహూ మారిస్సా మేయర్ 42.1 మిలియన్ డాలర్లు, లియోనార్డ్ ష్లీఫర్ 42 మిలియన్‌డాలర్లు పొందు తున్నారు. సేల్స్‌ఫోర్స్‌కు చెందిన మార్క్ బెనియాఫ్ 39.9 మిలియన్ డాలర్లు, బ్రెయిన్ రాబర్ట్స్ కామ్‌కాస్ట్ కంపెనీలో 33 మిలియన్

డాలర్లు పొందుతున్నారు. జెఫరీ బ్యాక్స్ టైమ్ వార్నర్‌లో 32.7 మిలియన్ల జీతం పొందుతున్నట్లు కార్పొరేట్ సర్వేలు చెపుతున్నాయి.

భారతీయ సంతతికి చెందిన ఇంద్రానూయీ పెప్సికోలో 19.1 మిలియన్ డాలర్లు వార్షిక వేతనంతో కొనసాగుతున్నారు. హ్యూలెట్‌ప్లాకార్డ్‌కు చెందిన సిఇఒ మార్గరెట్ విట్‌మాన్ 11శాతం వార్షిక ప్యాకేజి పొందుతూ సాలీనా 19.6 మిలియన్ డాలర్లు పొందుతోంది. అలాగే ఐబిఎం బాస్ వర్జీనియా రామెట్టీకి 3.6 మిలియన్ డాలర్ల బోనస్ కూడా అందింది. వార్షిక వేతనం మాత్రం 17.9 మిలియన్ డాలర్లు పొందుతోంది. అయితే ఆర్థిక ఫలితాలు ఆశించిన స్థాయిలో లేకపోతే బోనస్‌లు వంటివి తీసుకునేందుకు విముఖత వ్యక్తంచేయడం, కార్పొరేట్ కంపెనీలు వీరి విచక్షణను స్వాగతిస్తుండటంతో మహిళా శక్తికి తిరుగులేకుండా ఉంది.


హెచ్‌టి మీడియా గ్రూప్ డైరెక్టర్ శోభనా భర్తియా

అలాగే లకీడ్ మార్టిన్ కంపెనీలో పనిచేస్తున్న మార్లిన్ హ్యూసన్, సాలీనా వేతన ప్యాకేజి కింద 17.9 మిలియన్ డాలర్లు అందు కుంటున్నారు. 32ఏళ్ల వయసు లోనే హ్యూసన్ లకీడ్ మార్టిన్‌కు రెండో ఛీఫ్ ఎగ్జిక్యూటివ్‌గా ఒక రక్షణరంగ ఉత్పత్తుల కంపెనీకి పనిచేయడం గర్వకారణంగా ఫీలవుతున్నారు. అలాగే కంపెనీ స్టాక్ పెరిగిన తీరుకు అనుగుణంగా ఆమెకు వార్షిక ప్యాకేజిలు కూడా అందిస్తున్నారు.


విట్‌మన్


హ్యూసన్

మాండలిజ్ ఇంటర్నేషనల్ కంపెనీలో పనిచేస్తున్న ఐరేన్ రోసెన్‌ఫెల్డ్ వార్షిక వేత్తనం 15.9 మిలియన్ డాలర్లుగా ఉంది. ఓరియో కూకీస్ కాడ్‌బరీ చాకొలెట్, ట్రైడెంట్ గమ్ వంటి ఉత్పత్తుల కంపెనీ రోసెన్‌ఫెల్డ్ కంపెనీ వేతన ప్యాకేజిని 14శాతం పెంచింది. కంపెనీ స్టాక్ మూడుశాతంపెరిగింది. స్టాక్ మార్కెట్లలో 11.4శాతం సగటు వృద్ధితో పోలిస్తే కంపెనీ మూడుశాతంపెరిగింది.

డూప్యాంట్ కంపెనీ సిఇఒగా పనిచేస్తున్న ఎల్లెన్ కుల్‌మాన్ 13.1 మిలియన్ డాలర్లు వేతన ప్యాకేజిలో ఉన్నారు. 212 ఏళ్ల ప్రాచీన రసాయనాల కంపెనీకి కుల్‌మాన్ సిఇఒగా పనిచేయడం గర్వంగా ఫీలవుతారు.

భారత్‌లో సైతం ప్రతిభా సంపన్నులకు కొదవేమీలేదు. ఉన్నత చదవులు ఐఐటిలున ట్రిపుల్ ఐటిలు, ఐఐఎంలలో విద్యను అభ్యసించిన తర్వాత విదేశీ వర్సిటీల్లో పిహెచ్‌డిలు చేసి డాక్టరేట్ పట్టాలు పొందిన ఆర్థికవేత్తలు అక్కడే అధ్యాపకవృత్తిలో కొందరుంటే మరికొందరు సుదీర్ఘకాలం సెలవులపై భారత్‌కు వచ్చి కొలువుల్లో చేరి మళ్లీ వెళ్లిపోతున్నారు. అదే కోవకు చెందినవారే ప్రస్తుతం కేంద్రంలో ఉన్న నీతి ఆయోగ్ వైస్‌ఛైర్మన్ అరవింద్ పనగారియా, ప్రభుత్వ ఆర్థిక ప్రధాన సలహాదారు అరవింద్ సుబ్రహ్మణియన్‌లు. ఇకపోతే నిన్నమొన్నటివరకూ ఆర్‌బిఐ గవర్నర్‌గా పనిచేసిన రఘురామ్ రాజన్ కూడా అమెరికా వర్సిటీలో పనిచేసిన వారే తిరిగి అదే యూనివర్సిటీకి బోధనా వృత్తికి వెళ్లిపోతానని మూడేళ్ల పదవీకాలం తోనే స్వస్తి పలికారు. ఇలాంటి మేధా సంపన్నులకు కొదవేమీలేదు. ఇక పారిశ్రామిక కుటుంబా లనుంచి వచ్చిన సిఇఒల్లో కూడా అత్యున్నతస్థాయి విద్యా వంతులు కొందరైతే తనకున్న అవగాహన, మేధాసంపత్తితో ముందుకు తీసుకువెళుతున్న వ్యక్తులు మరికొందరున్నారు. సన్‌నెట్‌వర్క్ సిఇఒగా పనిచేస్తున్న మీడియా టైకూన్‌గా చెపుతున్న కళానిధి మారన్ సతీమణి కావేరి కళానిధి వార్షికపద్ధతిలో 72 కోట్ల ప్యాకేజి పొందుతున్నట్లు అంచనా. 2014లో ఆమె వేతన ప్యాకేజి మొత్తం 5,98, 900 రూపాయలుగా చెపుతారు. అంతేకాకుండా ఆమె స్పైస్‌జెట్ ఛైర్మన్‌గా కూడా వ్యవహరిం చారు. నాన్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్‌గా కూడా పనిచేసారు.


కిరణ్ మజుందార్

ఇక బయోఫార్మా ఆర్గనైజేషన్ సంస్థ వ్యవస్థా పకురాలిగా ప్రపంచ వ్యాప్తంగా ప్రశంసలందుకుంటున్న పారిశ్రామిక వేత్త కిరణ్‌మజుందార్ ప్రపంచంలోని టాప్ 100 శక్తి వంతమైన మహిళల్లో నిలిచారు. శాస్త్రీయ విజ్ఞానం రసాయన శాస్త్రంలో అమె చేసిన కృషికి గుర్తుగా ఆమెను బంగారు పతకం కూడా వరించింది. ఆమె వేతన ప్యాకకేజి 2014లో చూస్తే 16,347,463 రూపాయలుగా ఉంది.

ఇక అశోక్ పిరమల్‌గ్రూప్ ఛైర్‌పర్సన్ ఊర్వి ఎ పిరమల్ శక్తి వంతమైన మహిళాపారిశ్రామిక వేత్తగా నిలిచారు. 32 ఏళ్ల వయసు లోనే ఆమె ప్రపంచ బిజినెస్ సామ్రాజ్యంలోప్రవేశించి వృద్ధి చేసారు. ఆమె భర్త అశోక్ పిరమల్ తర్వాత ఆమె కుటుంబ వ్యాపారాన్ని భుజాలకెత్తుకున్నారు. రెండు ఇంజనీరింగ్ కంపెనీలతోపాటు, డైయింగ్, వస్త్రపరిశ్రమ మిల్లులను ఆమె నిర్వహించారు. నష్టాల్లో ఉన్న వ్యాపారాన్ని లాభాలదిశగా పయనింపచేయడంలో ఆమె విశేష కృషిచేసారు ఆమె వార్షిక వేతనం 7.3 కోట్లుగా చెపుతారు.

ఇక ప్రైవేటురంగ బ్యాంకింగ్ దిగ్గజం ఐసిఐసిఐబ్యాంకు సిఇఒ ఎండి చందాకొచ్చర్‌గురించి తెలియని వారే ఉండరు. 2005 నుంచి ఆమె ఫార్చ్యూన్ మ్యాగజైన్ ప్రచురిస్తున్న శక్తివంతమైన మహిళల జాబితాలో వస్తున్నారు. 2009లో ఆమె 20వ స్థానంలో వచ్చారు. రిటైల్ బ్యాంకింగ్ రంగానికి ఒక రూపాన్ని తీసుకు రావడంలో చందాకొచ్చర్‌పాత్ర అనిర్వచనీయంగా చెపుతున్నారు. ఐసిఐసి ఐగ్రూప్‌ను భారత్‌కే పరిమితం చేయకుండా విశ్వవ్యాప్తంచేయడంలో ఆమె కృషి ఫలించింది. చందాకొచ్చర్ మొత్తం వేతనప్యాకేజి 5,22,82,644 రూపాయలుగా చెపుతారు.



ఇక రాజ్యసభ మాజీ సభ్యురాలు అయిన శోభనా భర్తియా హిందూస్థాన్ టైమ్స్‌కు మీడియా ఎడిటోరియల్ డైరెక్టర్‌గా వ్యవహరించారు. ఆమె తండ్రి కెకెబిర్లానుంచి వచ్చిన తర్వాత ఆమె మీడియా రంగానికి వచ్చారు. హెచ్‌టిమీడియా ప్రస్తుతం దేశంలోనే అత్యంత లాభదాయకత కూడుకున్న గ్రూప్‌గా కొనసాగుతోంది. 2014లో శోభన కంపెనీ నికరలాభాన్ని 24 కోట్లనుంచి 155 కోట్లకు పెంచారు. అదేసంవత్సరంలో ఆమె మొత్తం ప్యాకేజి 2,68,800 రూపాయలుగా తీసుకున్నారు. ఇప్పటికీ విజయవంతంఅయిన మీడియా గ్రూప్‌గా హిందూస్థాన్ టైమ్స్ నడుస్తోంది.

ఇక తెలుగునేలపై ఆసుపత్రులను స్థాపించి దశదిశలా వ్యాపింప చేసిన అపోలో ఛైర్మన్‌ప్రతాప్ సి రెడ్డి కుమార్తె ప్రీతిరెడ్డి అపోలో హాస్పిటల్ ఎంటర్‌ప్రైజెస్‌కు ఎండిగా వ్యవహరిస్తున్నారు. హెల్త్‌కేర్ రంగంలో తలమానికంగా నిలిచిన అపోలో వృద్ధికి ప్రతాప్‌సిరెడ్డికి ఎల్లవేళలా అండగా నిలిచిన కుమార్తెల్లో ప్రీతి ఒకరు. నిత్యం ఆసుప్రత్రిగ్రూప్ వ్యవహారాల్లోనే తలమునకలయ్యే ప్రీతిరెడ్డి వేతన ప్యాకేజి 2014లోనే 5,11,10,000రూపాయలు అందుకునేవారని బిజినెస్ మ్యాగజైన్లు ప్రకటించాయి. ఆమె నాయకత్వంలోనే కేంద్ర ప్రభుత్వం నేషనల్ అక్రిడిటేషన్ బోర్డ్ ఫర్ హాస్పిటల్స్, హెల్త్‌కేర్‌ప్రొవైడర్స్ కోసం ప్రవేశపెట్టడంజరిగిందని నిపుణులు చెపుతారు.

భారత్‌లో అమలవుతున్న సరళీకృత ఆర్థిక సంస్కరణలు, పెట్టుబడులకు సానుకూల వాతావరణం, ఏకీకృత పన్నులవిధానం, ఆర్థికరంగంలో సంస్కరణలు వంటివి విదేశీ ఇన్వెస్టర్లు, పారిశ్రామిక వేత్తలను ఆకర్షిస్తున్నాయనే చెప్పాలి. అగ్రరాజ్యాలైన అమెరికా, యూరోప్‌లోని జర్మనీ, ఫ్రాన్స్,బ్రెజిల్, అతిచిన్నదేశం అయిన ఫిన్‌ల్యాండ్ వంటివి కూడా భారత్‌లో భారీ ఎత్తున జాయింట్ వెంచర్లకు ముందుకువచ్చాయి. అగ్రశ్రేణి రక్షణరంగ కంపెనీలు కూడా భారత పారిశ్రామికవేత్తలతో జాయింట్ వెంచర్లలో ఉన్నాయి. చమురుసహజవాయురంగంలో ఇలాంటిపెట్టుబడులు ఎక్కువ ఉన్నాయి. ఈసంస్థలు కేవలం భారత్‌కే పరిమితం కాకుండా విదేశీ చమురు సహజ వాయు రంగ అన్వేషణ ప్రాజెక్టుల్లో సైతం పెట్టుబడులు పెడుతున్నాయి. ఎన్‌డిఎ ప్రభుత్వం అధికారంలోనికి వచ్చిన తర్వాత ముఖ్యంగా నరేంద్రమోడీ ప్రధానిగా బాధ్యతలు స్వీకరించిన తర్వాత విదేశీ పాలకుల్లో మార్పులు వస్తున్నాయి. గతంలో భారత్‌లో పన్నుల అరాచకం ఎక్కువని పెట్టుబడులకు వెనుకంజవేసే అతిపెద్ద ఇన్వెస్టర్లు, సంస్థలు ఇపుడు భారత్‌లో పెట్టుబడులకు ముందుకువస్తున్నారు. ఓపక్క పక్కలో బల్లెంలా కొనసాగుతూనే చైనా కూడా భారత పారిశ్రామిక కారిడార్లలో పెట్టుబడులతో ముందుంటున్నది. జపాన్‌పరంగా ఇప్పటికే పలు సంస్థలను ఏర్పాటుచేసింది. ఎయిర్‌బస్, ఎంబ్రాయిర్, బోయింగ్ వంటి సంస్థలు తమతమ విడిభాగాల తయారీకి భారత్‌లోని పేరుపొందిన పారిశ్రామిక సంస్థలను ఎంపికచేసుకున్నాయంటే భారత్‌లోని మేధావులు, ప్రతిభా సంపన్నులపై ఉన్న విశ్వాసమేనని చెప్పాలి.


సాఫ్ట్ బ్యాంక్ సిఇఒ నికేష్ అరోరా

ఇందుకు అనుగుణంగానే ఆయా కంపెనీలు సంస్థల్లో పనిచేసే సిఇఒలు, ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్లు, డైరెక్టర్‌స్థాయి అధికారులకు కీలక బాధ్యతలు అప్పగించడంతోపాటు వారికి భారీ ఎత్తున వేతన ప్యాకేజిని కూడా ఆఫర్‌చేస్తున్నాయి. టెలికమ్యూనికేషన్స్, ఇంజనీరింగ్, వినియోగరంగ ఉత్పత్తులు, మొబైల్‌ఫోన్ తయారీ సంస్థలపరంగా ఈ వేతన ప్యాకేజిలు అత్యధికంగా ఉంటున్నాయనే చెప్పాలి.

ఇక భారత్‌లోని వివిధ రంగాలోన్లి పురుషుల్లో కూడా అత్యధికంగా వేతన ప్యాకేజిలు పొందుతున్న సిఇఒలు ఎక్కువ మందే ఉన్నారు. వీరి ప్రతిభా పాటవాలు ఒక ఎత్తయితే కుటుంబపరంగాను వారసత్వం గాను వస్తున్న బాధ్యతలు వీరిలో అనుభవాన్ని పెంచుతు న్నాయి. ప్రస్తుతం హీరోమోటోకార్ప్ సిఎండి సిఇఒపవన్ ముంజాల్ పేరు అందరికీ సుపరిచితమే. ఆయన ఈ కోవలోనికే వస్తారు పవన్‌కాంత్ ముంజాల్‌గా పేరున్న ఆయన వార్షిక ప్యాకేజి 44.62 కోట్లు. ఇక ఆదిత్యబిర్లాగ్రూప్ యజమాని కుమార మంగళం బిర్లా గ్రూప్‌ఛైర్మన్ హోదాలో ఆయన పొందుతున్న వేతన ప్యాకేజి 44.56 కోట్లు. ఇక ముంజాల్ తండ్రి బ్రిజ్‌మోహన్‌లాల్ ముంజాల్ ఛైర్మన్‌గా ఉన్న కాలంలో ఫోర్బ్స్ జాబితాలోనే ఐదోర్యాంకులో నిలిచారు. ఆయన వేతన ప్యాకేజి 44.19 కోట్లుగా ఉండేది. .ప్రస్తుతం భారత్‌లోని అగ్రగామి బిజినెస్‌మెన్ ఇటీవలే అపరకుబేరునిగా ఫోర్బ్స్ జాబితాలో రికార్డు అయిన ముకేష్ అంబాని వార్షికవేతనం కేవలం 15 కోట్లు మాత్రమే అంటే అందరికీ ఆశ్చర్యం కలగక మానదు. ఇక నిర్మాణరంగంలో ప్రముఖంగాను అంతర్జాతీయంగా పేరుపొందిన ఎల్‌అండ్‌టి గ్రూప్‌ఛైర్మన్‌గా పనిచేస్తున్న ఎఎం నాయక్ వేతన ప్యాకేజి 27.31 కోట్లుగా ఉంది. టెలి దిగ్గజం ఎయిర్‌టెల్ అధినేత సునీల్ భారతి మిట్టల్ వార్షిక వేతనం గత ఏడాది 27.18 కోట్లుగానే ఉంది.


పవన్ ముంజాల్

టెక్నాలజీరంగంలో వస్తున్న అత్యధిక మార్పుల కారణంగా టెక్ కంపెనీల సిఇఒలు ఎండిలకు భారీ వేతన ప్యాకేజిలు అందుతు న్నాయి. టెక్ మహీంద్ర ఎండి సిఇఒ సిపి గుర్నానికి 165.6 కోట్ల వార్షిక వేతన ప్యాకేజి ఆ కంపెనీ ఆఫర్‌చేసింది. ఇక ఫార్మా మేజర్ లూపిన్ కంపెనీ ఛైర్మన్ డిబి గుప్తాకు 37.6 కోట్లుగా ఉంది.

హెచ్‌డిఎఫ్‌సి బ్యాంకు సిఇఒకు 32.8 కోట్లు వేతన ప్యాకేజిలతో కొనసాగుతున్నారు. సన్‌టివి నెట్‌వర్క్ కళానిధి మారన్ వేతన ప్యాకేజి 56.25 కోట్లుగా ఉంది. ఇక జిందాల్ గ్రూప్ ఛైర్మన్ నవీన్‌జిందాల్ పార్లమెంటు సభ్యునిగాకూడా ఉన్నారు. ఆయన వార్షిక వేతనం 54.98 కోట్లుగా ఉంది. స్టీల్, సిమెంట్, విద్యుత్ రంగాల్లో ఆయనగ్రూప్ దేశంలోను అంతర్జాతీయం గాను పలు ప్రాజెక్టులు నిర్వహిస్తోంది. ఇక రామ్‌కో గ్రూప్‌ల అధినేత ఎండిసిఇఒ పిఆర్ రామ సుబ్రమ్మణ్య రాజా 1938 లో ఆగ్రూప్‌ను స్థాపించారు. అప్పటినుంచి కంపెనీని దినదినప్రవర్థమానం చేయడంలో అయనదే కీలక పాత్ర. ఆయన వార్షిక వేతన ప్యాకేజి 30.96 కోట్లుగా ఉంది. ప్రస్తుతం ఇదే కంపెనీని మద్రాసు సిమెంట్స్‌గా పిలుస్తున్నారు. ఇక చిన్నకార్ల దిగ్గజంగా పిలిచే మారుతిసుజుకి భారత్ విభాగం ఎండి వార్షిక వేతనం 30.90 కోట్లుగా ఉంది. షింజో నకనిషి మారుతిలో 2007 నుంచి కొనసాగుతున్నారు. సీనియర్ మేనేజ్‌మెంట్ ఎగిజక్యూటివ్ అధికారిగాను, ఎగ్జిక్యూటివ్ జనరల్ మేనేజర్‌గాను కొనసాగుతు న్నారు. సుజుకి మోటార్ కార్పొరేషన్‌కు నకనిషిని 1999లోనే డైరెక్టర్‌గా నియమించింది. ఇక ఫార్మారంగం లోని పరిశోధన విభాగంలో దివిల్యాబ్స్‌కు ప్రత్యేక గుర్తింపు ఉంది. దివి లేబరేటరీస్‌తో ఆయన దశదిశలా కంపెనీ కీర్తిని వ్యాపింప చేశారు. డా.మురళి కె దివి ఈ కంపెనీ సిఎండిగా ఉన్నారు. ఆయన వేతన ప్యాకేజి సాలీనా 26.46 కోట్లుగా ఉందని బిజినెస్ మ్యాగజైన్లు ప్రకటించాయి. కాకతీయ వర్సిటీనుంచి ఫార్మాసైన్సెస్‌లో డాక్టరేట్ డిగ్రీ పొందిన తర్వాత అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కెమికల్ ఇంజనీర్స్, అమెరికన్ కెమికల్‌సొసైటీ, అమెరికన్ కాస్మెటిక్‌సొసైటీ, అమెరికన్ ఫార్మా అసోసియేషన్‌లో కూడా ప్రాతినిధ్యం వహించారు. 30ఏళ్ల ఫార్మారంగ అనుభవంతో ఆయన స్థాపిం చిన దివిల్యాబ్స్ ప్రస్తుతం దక్షిణాదిలోనే కాకుండా దేశ విదేశాల్లో కూడా ప్రతిష్ట పెంచుకుంది.


రాజా

అలాగే భారతీయ సంతతికి చెందిన ప్రతిభాసంపన్నులు విదేశీ బహుళజాతి దిగ్గజాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. జపాన్‌కు చెందిన సాఫ్ట్‌బ్యాంక్ అధినేతగా భారతీయ సంతతికి చెందిన నికిష్ ఆరోరా నియమితులయ్యారు. ఆయన వేతన ప్యాకేజి 135 మిలియన్ డాలర్లుగా ఉంది. భారతీయ కరెన్సీలో రూ.850 కోట్లు అని అంచనా. అలాగే అంతర్జాల సర్చింజన్ సంస్థ గూగుల్ కంపెనీ సిఇఒగా నియమితుడయిన సుందర్ పిచ్చయ్ వేతన ప్యాకేజిపై అప్పట్లోనే అంతర్జాతీయంగా బహుముఖ చర్చలు జరిగాయి. భారతీయ కరెన్సీలో చూస్తే ఆయన వేతనం రూ.335 కోట్లుగా ఉంది. వార్షికంగా 50 మిలియన్ డాలర్లుగా ప్రకటించింది. అంతే కాకుండా ఆయన 142 మిలియన్ పౌండ్ల విలువైన గూగుల్‌షేర్లు పొందారు. మరో 173 మిలియన్ పౌండ్ల విలువైన గూగుల్ మాతృసంస్థ ఆల్ఫాబెట్ నుంచి పొందినట్లు విదేశీ పత్రికలు ప్రకటిం చాయి. ఇక మైక్రోసాఫ్ట్ సిఇఒగా భారతీయ సంతతికే చెందిన సత్యానాదెళ్ల కొనసాగు తున్న సంగతి తెలిసిందే. 2015లో ఆయన వార్షికవేతన ప్యాకేజి కింద రూ.575 కోట్లు కంపెనీ అందచేసింది. అమెరికాలో అత్యధికంగా వేతన డిమాండ్ ఉన్న సిఇఒగా అక్కడి పత్రికలు వెల్లడించాయి. డాలర్ కరెన్సీలో చూస్తే 84.3 మిలియన్ డాలర్లని అంచనా. సత్యానాదెళ్ల నియామకం తర్వాత పలు కంపెనీల విలీనాలు కొనుగోళ్లు భారీ ఎత్తున మైక్రోసాఫ్ట్ చేపట్టింది. ఇటీవలే ట్విట్టర్ కొనుగోలుకు సైతం మైక్రోసాఫ్ట్ పేరు పెద్ద ఎత్తున ప్రచారం జరిగింది. ఇక భారత్‌లోని ప్రైవేటురంగంలో మంచి ప్రతిభ ఉన్న కార్పొరేట్ నిపుణులకు కొదవేమీలేదు. వారి వేతన అవకాశాలు కూడా తక్కువేమీ కాదు. సిఇఒల జీతభత్యాలు సగటున రూ. 20 కోట్లకు చేరాయి. ప్రైవేటురంగంలో ఎల్‌అండ్‌టి ఎఎంనాయక్ అత్యధికంగా 66.14కోట్లు పొందుతున్నట్లు అంచనా. అదే అమెరికాలో అయితే 20 మిలియన్ డాలర్లు సగటు ఉంటుంది. భారతీయ కరెన్సీలో 130 కోట్ల రూపాయలని చెప్పాలి. అయితే ప్రభుత్వరంగం లోని సిఇఒలు ఎండిల వేతన ప్యాకేజి తక్కువే. ప్రభుత్వరంగ బ్యాంకింగ్ దిగ్గజం ఎస్‌బిఐ ఛైర్‌పర్సన్ అరుంధతీభట్టాచార్య వేతన ప్యాకేజి కేవలం 31.1 లక్షలేనంటే ఆశ్చర్యం కలుగక మానదు.

యాక్సిస్‌బ్యాంకు శిఖాశర్మ 5.5కోట్లు, ఐసిఐసిఐ బ్యాంకు చందాకొచ్చర్ 6.6 కోట్లు, హెచ్‌డిఎఫ్‌సి బ్యాంకు ఆదిత్య పూరి 9.7 కోట్లుగా ఉంటుంది. ఇక ఆదాని పోర్టులు సెజ్ కంపెనీ ఛైర్మన్ మేనేజింగ్ డైరెక్టర్ వేతన ప్యాకేజి 2.8 కోట్లుగా ఉంది. ఆదానిపోర్టుల పూర్తికాలపు డైరెక్టర్ మాలే మహాదేవియా సాలీనా 10.7 కోట్లు ప్యాకేజి పొందారు. ఇక సిఇఒ కరణ్ ఆదాని జాయిన్ అయిన మొదటి ఏడాదికి వేతన ప్యాకేజి ప్రకటించ లేదని తేలింది. ఇక బజాజ్ ఆటో ఛైర్మన్ రాహుల్ బజాజ్ వేతన ప్యాకేజి 11.3 కోట్లుగా ఉంది.



ఆయన తనయుడు రాజవ్‌బజాజ్ 22.32 కోట్లు వేతనం పొందారు. ఇక వైస్‌ఛైర్మన్ మాధుర్ బజాజ్ 8.5 కోట్లుగా ఉంది. టాటామోటార్స్ సిఇఒ ఎండి గూంటర్ బట్‌షెక్ 5.04 కోట్లుగా ఉంది. ఇక ఎంఅండ్‌ఎం ఛీఫ్ ఆనంద్ మహీంద్ర రూ.6.58 కోట్లుగా ఉంది. ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ పవన్ గోయంకా 11.6 కోట్లు పరిహారం పొందారు. ఇక హిందూస్థాన్ యూనిలీవర్ సిఇఒ సంజీవ్ మెహాతా మొత్తం చెల్లింపుల ప్యాకేజి 13.87 కోట్లుగా ఉంది. టెక్నాలజీ దిగ్గజం టాటా కన్సల్టింగ్ సర్వీసెస్(టిసిఎస్)ను నలుదిక్కుల వ్యాపింప చేసిన సాఫ్ట్‌వేర్ దిగ్గజం టిసిఎస్‌ఎన్.చంద్రశేఖరన్ వేతన ప్యాకేజి 25.6 కోట్లుగా ఉంది. అదే విధంగా ఐటిసి ఛీఫ్ వైసి దేవేశ్వర్ వేతనాలు కూడా 15.15 కోట్లు, విప్రో ఛైర్మన్ అజీమ్ ప్రేమ్‌జీ వేతన ప్యాకేజి 2.17 కోట్లుగా ఉంది. ఆయన తనయుడు రిషద్‌కు 2.15 కోట్లు వేతనప్యాకేజి ఉంది. మాజీ సిఇఒ టికె కురియన్ 13.66 కోట్లు ప్యాకేజితో ఉన్నారు. కొత్త సిఇఒ లబిదాలి నీముచ్‌వాలాకు 11.96 కోట్లు వేతనం ఇతర భత్యాల పరంగా ప్యాకేజిని నిర్ణయించారు. ఇలా చెప్పాలంటే కోట్లకు పడగలెత్తినవారు ఎందరెందరో. ఐ.టి., పారిశ్రామికరంగాల్లో ఆసక్తిగల వారికి వీరు స్ఫూర్తిదాయకంగా ఉన్నారు. ■

# ఆత్మబలం ఉంటే అన్నీ సాధ్యాలే..

**'చేతుల్లేకపోతే మనిషి చేతగాని వాడే' అన్నది సర్వసాధారణ భావన. అయితే కొంతమంది ఇది తప్పని మనిషికి చేతుల కన్నా ముఖ్యంగా కావలసింది కార్యదీక్ష, పట్టుదల, ఆత్మవిశ్వాసాలని రుజువు చేస్తుంటారు. అలాటి అరుదైన కొందరిలో ఒకరు ధవళ్ ఖత్రి. ఇతని పూర్తి పేరు ధవళ్ జ్యోత్స్నబెన్ కౌషిక్‌భాయ్ ఖత్రి. ధవళ్ అంటాడు..**

**మత్ కర్ ఎకీన్ అప్నే హాతోంకి<br>లకీరొ పర్..<br>నసీబ్ ఉన్కే భీ హోతె హై జిన్‌కు<br>హాత్ నహీ హోతె..**



చేతుల్లేకున్నా కళాసాధనకు అడ్డేమీ లేదని నిరూపించాడు. పధ్నాలుగేళ్ల ప్రాయంలో సంక్రాంతి రోజున మేడపైన ఉత్సాహంగా పతంగులెగరేస్తూ గాలిపటం దారానికి బదులు ఓ విద్యుత్ తీగను పట్టుకున్నాడు. ఇంకేముంది! షాక్ తీవ్రంగా కొట్టి మేడ మీదనుంచి కిందప;డ్డాడు. చేతులు అతి తీవ్రంగా కాలిపోయాయి. గుండె కొన్ని సెకన్లు కొట్టుకోలేదు. క్షణాల్లో ఆసుపత్రికి చేర్చారు. డాక్టర్లు అతడి ప్రాణాలు నిలపటానికి చేసిన కృషి ఫలించింది. గుండె కొట్టుకోవడం మొదలుపెట్టింది. ధవళ్ పునర్జన్మ ఎత్తాడు. కానీ రెండు చేతులను మాత్రం కోల్పోవలసి వచ్చింది. ధవళ్ తన పరిస్థితికి నిరాశ చెందలేదు. తాను బతకటమే గొప్పవిషయంగా భావించాడు. తనకున్న శక్తి పరిధిలో చేయగలిగిందంతా చేయాలని తీర్మానించుకున్నాడు.



ఆసుపత్రిలో ఉన్నప్పుడు తల్లి అతడికి రోజూ పెన్ను, పెన్సిల్ అందించి ప్రాక్టీసు చేయమనేది. మొండిచేతులతోనే పెన్ను, పెన్సిల్ వాడకం సాధనచేయసాగాడు. క్రమంగా స్కెచింగ్, పెయింటింగ్‌లు చేయసాగాడు. ఆరునెల్ల అకుంఠిత సాధన చిత్రలేఖనంలో అతణ్ని నిపుణుడుగా తీర్చిదిద్దింది. ఎలాగో బతికి బయటపడ్డ అతనికి బడిలో తిరస్కారమే ఎదురయింది. ఓదార్చి, ప్రోత్సహించ వలసిన స్కూల్ ప్రిన్సిపాల్ 'నీకు చేతుల్లేవు కాబట్టి చదువుకోవటం కేవలం కల మాత్రమే' అని స్కూలు నుంచి పంపేశారు.



కానీ ధవళ్‌కు చదువుకోవాలని ఎంతో కోరిక. అందుకే ప్రయత్నించి మరో స్కూల్లో చేరాడు. ఆ తర్వాత గ్రాడ్యుయేషన్ కూడా పూర్తిచేశాడు. 'అన్ని పరీక్షలు నేనే స్వయంగా రాశాను. ఎవరి సహాయం తీసుకోలేదు. పైగా మిగతావారి కంటే ముందుగానే పరీక్ష రాయడం పూర్తిచేసేవాడిని. క్రికెట్, ఫుట్‌బాల్ కూడా ఆడతాను. గిటార్ కూడా నేర్చుకున్నాను. పుస్తకపఠనం నాకెంతో ఇష్టం. దానికి కొంత సమయం కేటాయిస్తాను. ఎక్సర్‌సైజులు కూడా చేస్తాను. ఇప్పుడు టీ పెయింటింగ్స్, టాటూలు కూడా వేస్తున్నాను' అంటాడు. అంతే కాదు, వెబ్ డిజైనింగ్, గ్రాఫిక్స్‌లలో సైతం సాధన మొదలుపెట్టాడు. ఒక్కో స్కెచ్ పూర్తి చేయడానికి అతడికి 2నుంచి 3 గంటలు మాత్రమే పడుతుంది.

రోజూ ఉదయానే లేచి ప్రార్ధన చేసుకొని, తనకు బహుమతులుగా ఎన్నో కళలనిచ్చిన దైవానికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటాడు. తనకు ముగ్గురు ఆరాధ్య దైవాలున్నారంటాడు, వారు..ఒకరు మహాత్మాగాంధి.. అహింస, సత్యాగ్రహాలతో కూడిన బాపూజీ మార్గం ధవళ్‌కు ఎంతో ఇష్టం. ఎటువంటి రక్తపాతం లేకుండా పనులు సాధించిన బాపూజీకి గాలిలోనే అభివాదాలు సమర్పిస్తాడు. రెండో ఆరాధ్య దైవం అమితాబ్ అని.. అమితాబ్ వయసుపైబడ్డా ఆయన హృదయంలో యువకుడే అని, ఈరోజుకీ ఆయన హిట్లపై హిట్లు కొడు తున్నారని, ఇక తాను ఆరాధించే మూడో వ్యక్తి మహేంద్రసింగ్ ధోనీ అని, క్రికెట్‌లో ఎటువంటి పరిస్థితినయినా ఎదుర్కోగల అతడి సత్తా, ఒత్తిడి సమయంలో నిబ్బరంతో ఆడే అతడి నేర్పు తనకెంతో ప్రేరణనిచ్చాయంటాడు.

'పెయింటింగ్ నేను స్వయంగా నేర్చుకున్నదే. కాలేజీ చదువు పూర్తయ్యాక పెయింటింగ్‌లో కోర్సు చేయాలని ఎన్నో యూనివర్సిటీలకు దరఖాస్తు చేశాను. కానీ అన్ని యూనివర్సిటీలు నా దరఖాస్తును తిరస్కరించాయి. దాంతో నాకు నేనే పెయింటింగ్‌లు వేయటం మొదలు పెట్టాను. ఇప్పటి వరకు 300 వరకు పెయింటింగ్‌లు వేశాను. ఎన్నో టెలివిజన్ షోలలో పాల్గొన్నాను. నాకు పెయింటింగ్‌లకు సంబంధించి ప్రపంచం నలుమూలలనుంచి ఆర్డర్లు వస్తుంటాయి. గుజరాత్, ముంబయిలలో ఎన్నో లైవ్ షోలిచ్చాను. 'ఏదీ అసాధ్యం కాదు' అన్న మాటలో నాకు పూర్తి విశ్వాసం ఉంది. చేరాలనుకున్న లక్ష్యంపై కృతనిశ్చయంతో ఉంటేచాలు' అంటాడు ధవళ్.

శారీరకంగా సలక్షణంగా ఉండి కూడా ఒక లక్ష్యమన్నది లేకుండా కాలం వృధాచేసేవారు ధవళ్‌ను చూసి నేర్చుకోవలసి ఉంది. అంతే కాదు, చిన్నపాటి ఇబ్బందులనే కొండంతలుగా ఊహించుకుంటూ, తమ సాధనకు, విజయాలకు అవే అడ్డంకులని సాకులు చెపుతూ, తమపై తామే సానుభూతి కురిపించుకునేవారు సైతం ధవళ్ గురించి తెలుసుకొని, తమకు తాము ఆత్మపరిశీలన చేసుకొని, స్ఫూర్తి పొందవలసి ఉంది. చేతుల్లేకుంటే ఏం, చేతల్లో మొనగాడైన ధవళ్ మరింత వెలుగులోకి రావాలని, అంతర్జాతీయ కీర్తి, ప్రతిష్ఠలను మరింతగా అందుకోవాలని ఆకాంక్షిద్దాం.

# కృతి

## యువతకు కరదీపికలు



సమకాలీన సమాజంలోని లోటుపాట్లను, వికృత పోకడలను, యువతతీరు.. వగైరాలన్నిటినీ నిశితంగా గమనిస్తూ వివిధ వ్యాసరచన పోటీల్లో పాల్గొని, బహుమతులందుకున్నారు బొగ్గరపు రాధాకృష్ణమూర్తి. ఆ వ్యాసాలను 'వ్యాసమంజరి'పేరిట ఒక సంపుటిగా వెలువరించారు. ఇందులో తొలివ్యాసం 'మంచిగా జీవించటంలో...' ఎంతో విలువైందిగా ఉంది. ఈవ్యాసంలో 'జీవితం కరిగిపోయే మంచు.. ఉన్నంతలో నలుగురికీ పంచు' అంటారు. చివరగా 'మన లోపాలు మనమే సవరించుకోవాలి.. మన సమాజాన్ని సుందరంగా మళ్లీ మనమే నిర్మించుకోవాలి' అనడం ఎంతైనా బాగుంది. మణిదీపంలాంటి మరో వ్యాసం, 'మానవతా వాదం- విశిష్టత'. 'సాహిత్యంలో మానవతావాదం' పేరిట ఇంకోవ్యాసం ఉంది.ఇందులో కవులు తమ కవిత్వంలో మానవతావాదాన్ని ఎలా ప్రతిధ్వనించారో వివరించారు. 'జీవితమంటే..'అనే వ్యాసంలో ఇలా అంటారు.. 'జీవితం ఎవరికైనావరం/ సవాళ్లకు రాకూడదు కలవరం/ జీవితంలో పలకాలి సత్కార్య స్వరాలు/ మరుజన్మకు మిగలాలి సత్కర్మ ఫలాలు'. ఎంత చక్కటి సందేశం! శీల సంపద, జాతీయ సమైక్యత - యువతరం పాత్ర మొదలైన వ్యాసాలు స్ఫూర్తిదాయకంగా ఉన్నాయి.

**(వ్యాసమంజరి-వ్యాసాల సంపుటి:బొగ్గరపు రాధాకృష్ణమూర్తి; వెల: రు. 100; ప్రతులకు: బొగ్గరపు ఇందిరాకృష్ణ, ఇంటినెం. 16-8-364,శ్రీ చైతన్యకాలేజి ఎదురుగా, రామలింగాపురం, నెల్లూరు-524003, ఆం.ప్ర)**

– ప్రభాస

## నదీ ప్రవాహంలా సాగే నవల..



జీవిత పాఠాల్నే కథలుగా, నవలలుగా అందిస్తోన్న టి.ఎస్.ఎ.కృష్ణమూర్తి ఇప్పుడు 'ఆయుధం' పేరిట మరో నవలను అందించారు. ఇది ఓ ప్రముఖ మాస పత్రిక నిర్వహించిన పోటీలో బహుమతి గెలుచుకుని ధారావాహికగా ప్రచురితమైంది. ఈ నవల దాదాపు అరవయేళ్ల (1940–2000) కాలాన్ని కవర్ చేసుకుంటూ సాగుతుంది. ఆముదపు దీపాల రాత్రి వెలుగు నుంచి విద్యుచ్ఛక్తి దీపాలదాకా; కాలినడక, ఎడ్లబాట నుండి బస్సు రూటు దాకా; ప్రచారసాధనాలేవీ లేని కాలం నుంచి పత్రికా ప్రచురణదాకా నడిచిన జీవన గమనాల్ని ఏకరువు పెట్టుకుంటూ నదీ ప్రవాహంలా సాగుతుందీ నవల. ఇందులో నాయకుడు రాజయ్య తన బాల్యంలో తన తల్లి అత్యాచారానికి గురయితే ఆ అత్యాచారం చేసిన వారి మీద తనచేతికి మట్టి అంటకుండా తనో ఆయుధమై మట్టుపెడతాడు. వడ్డెర కులానికి చెందిన రాజయ్య, తననీ, తన కులాన్నీ, లేమినీ అపహాస్యంచేసిన ఊరిపెద్దల కళ్లముందే ఉన్నతకులాలు ఈర్ష్యపడేంత స్థాయికి ఎదుగుతాడు. పట్టుదల, మొక్కవోని దీక్ష ఉంటే న్యాయమైన దేదైనా సాధించవచ్చునని తెలిపే ఈనవలలో రచయిత ఎక్కడా, విసుగు పుట్టనీయకుండా తర్వాత ఏం జరుగుతుంది?, ఎలా జరుగుతుంది? అన్న ఉత్కంఠను కడదాకా కొనసాగించి అంతిమవిజయం న్యాయానిదేనని నిరూపిస్తారు.

**(ఆయుధం-నవల:టి.ఎస్.ఎ.కృష్ణమూర్తి; వెల:రూ.180; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక విక్రయకేంద్రాలు)**

-కూర చిదంబరం

## ఇవీ అందాయి..



చెరువు నవ్వింది: వడిచర్ల సత్యం
వెల:రు.30; ప్రతులకు:వడిచర్లసత్యం,
ఇం.నెం.2-2-87/29, సాయినగర్; సాయిపూర్
తాండూరు, వికారాబాద్‌జిల్లా-501141, తెలంగాణ



పుష్కర ప్రాశస్త్యము
సుశర్మ
వెల:రు.100;
ప్రతులకు:అన్ని ప్రముఖ బుక్‌స్టాల్స్



భావవీచికలు: సవ్వప్పగారి ఈరన్న
వెల:రు.20; ప్రతులకు:సవ్వప్పగారి ఈరన్న
15-58-సి, శ్రీరాములుపేట
పత్తికొండ-518380, కర్నూలుజిల్లా, ఆం.ప్ర.



భిక్షాపాత్ర- దీర్ఘకవిత: బరకు; వెల:రు.25;
ప్రతులకు:బి.రవికుమార్, ఫ్లాట్ నం.13,
ఎన్‌టిఆర్ కాలనీ,వెంకటాపురం పంచాయితి,
ఏలూరు-534002,ప.గో.జిల్లా, ఆం.ప్ర.

## ఆదాయం పన్నుపై అవగాహనకు..



చాలామంది ఇన్‌కమ్ గురించి ఆలోచిస్తారు కానీ ఇన్‌కమ్ టాక్స్ గురించి ఆలోచించరు. ఇన్‌కమ్ టాక్స్ రిటర్న్ ఫైల్ చేసే గడువు దగ్గరకొచ్చే ముందు సంబంధిత నిపుణులను సంప్రదించి పని పూర్తి చేస్తారు. అలా కాకుండా ఇన్‌కమ్ టాక్స్ గురించి తమకే పరిజ్ఞానం ఉంటే మంచిదికదా. అందుకే అందరికీ ఇన్‌కమ్‌టాక్స్ గురించిన అవగాహనకోసం డా.కె. కిరణ్ కుమార్ 'మీ ఇన్‌కమ్‌టాక్స్ పరిజ్ఞానాన్ని పెంచుకోండి' పేరిట చక్కని పుస్తకాన్ని అందించారు. ఈ పుస్తకం చదవటం వల్ల ఇన్‌కమ్‌టాక్స్‌కు సంబంధించిన ఎన్నో సందేహాలను నివృత్తిచేసుకోవచ్చు. మైనర్లకు ఆదాయం ఉంటే దానికి ఎలా టాక్స్ ప్లాన్ చేసుకోవాలో ముందుగా వివరించారు. ఆపైన సీనియర్‌సిటిజన్లకు లభించే పన్నుప్రయోజనాలను, వ్యవసాయదారులకు ఉన్న పన్నుప్రయోజనాలను, ఇలా ఎన్నెన్నో తెలియ జేశారు. ఆతర్వాత పన్ను మినహాయింపుల గురించి విపులీకరించారు. ఆదాయపన్ను గురించి హెచ్చరిక సిగ్నల్స్ కూడా అందించారు. దేశ పౌరులుగా ప్రతి ఒక్కరూ ఎంతో కొంత తమ బాధ్యతగా ఆదాయ పన్నుని సక్రమంగా చెల్లించాలని కూడా చెప్పారు. ఇలా ఇన్‌కమ్ టాక్స్ గురించి అందరికీ అర్థమయ్యే రీతిలో అందించిన ఈ పుస్తకం ప్రతివారు చదవతగ్గది.

**(మీ ఇన్‌కమ్ టాక్స్ పరిజ్ఞానాన్ని పెంచుకోండి:డా.కె.కిరణ్‌కుమార్; వెల:రు.120; ప్రతులకు:శ్రీవైభవ పబ్లికేషన్స్, ఫ్లాట్‌నం.102, దివ్య సాయి అపార్ట్‌మెంట్స్, ఇంటినెం.1-9-285/9/1, విద్యానగర్, హైదరాబాద్-44, తెలంగాణ)**

-శ్రీహాస




# కడలిగా మారిన కన్నీరు!

కస్తూరి మురళీకృష్ణ

**యెమోజా, ఒలోకున్‌లు ఒకరిని వదలి ఒకరు ఉండలేరు. తమ నీటిలోకంలో వారు ఎంతో ఆనందంగా గడుపుతున్నారు. వారికి ప్రపంచంలో మరే విషయంతో సంబంధంలేదు.**

**ఎలా కలిశారో తెలియదు.**

**ఎప్పుడు కలిశారో తెలియదు.**

**కానీ ఊహ తెలిసినప్పటినుంచీ వాళ్లిద్దరూ కలిసే ఉంటున్నారు. ఒకరు లేని క్షణాలను మరొకరు ఊహించలేకపోతున్నారు.**

**వారి చుట్టూ నల్లదనం. ఆ నల్లదనంలో నీలి సముద్రం.**

**ఎటుచూసినా నీరే. విశ్వమంతా సముద్రమే.**

**వారిద్దరూ ఆ నీటిలో తేలుతున్నారు. ఆడుతున్నారు.**

ఎటో వెళ్లిపోతామన్న భయంలేదు.

ఎటో వెళ్లాలన్న తొందరలేదు.

ఎటో వెళ్లి ఏదో సాధించాలన్న ఆత్రంలేదు.

అనంతమైన కాలం అనంతంగా పరచుకుని ఉంది. అనంతమైన జలరాశి అనంతంగా విస్తరించి ఉంది.

ఆ నీటిలోనే వారి జీవితం. ఆ నీటిలోనే వారి సంసారం. అక్కడే వారికి సంతానం కలిగింది. అంతా నీటిలోనే హాయిగా ఉంటున్నారు.

ఇంతలో ఒకరోజు ఎటునుంచి వచ్చాడో తెలియదు, ఓ వ్యక్తి వాళ్ల దగ్గరకు వచ్చాడు.

సముద్రాన్ని చూశాడు. సంతృప్తిగా నిట్టూర్చాడు.

అతడిని చూస్తూంటే యెమోజా, ఓలోకున్‌లకు ఎలాంటి భయాందోళనలు కలగటంలేదు. పైగా, ఎవరో ఆత్మీయుడిని, ఎన్నెన్నో జన్మలుగా అత్యంత సన్నిహితంగా మెలిగిన వాడిని చూస్తున్న ఆనందం కలుగుతోంది.

తామున్నది సముద్రం కాదు ప్రేమ సముద్రం అనిపిస్తోంది.

అతడు తన వెనుక చీకట్లోకి చూశాడు.

'ఒడూడువా' చీకట్లోంచి వచ్చాడు.

వాళ్లిద్దరూ సముద్రాన్ని పరిశీలనగా చూశారు.

వాళ్లిద్దరినీ చూస్తూంటేనే అత్యంత సంతోషం కలుగుతోంది ఒడూడువాకు.

'మీ కర్తవ్యాన్ని మీరు చాలా బాగా నిర్వహిస్తున్నారు' అన్నాడు ఒడూడువా.

సంతోషం తరంగంలా ఎగసిపడింది యెమోజాలో.

గర్వంగా కూడా అనిపించింది.

ఎందుకంటే ఇప్పుడు వారి వల్ల సృష్టి చైతన్యవంతం అవుతుంది.

ఇంతకాలం సృష్టికి అవసరమైన జీవాన్ని వారు కాపాడుతూ వచ్చారు. వారిద్దరూ మళ్లీ చీకట్లోకి చూశారు.

చీకట్లోంచి వెన్నెల చిరునవ్వులు చిందిస్తూ 'ఈశు' వచ్చింది.

యెమోజా ఓలోకున్‌లకు అర్థమయింది.

ఇన్నాళ్ల తమ కృషి ఇప్పుడు సాకారమవుతోంది.

ఎదురుగా ఉన్న ఒబాతల, ఒడూడువాలు అత్యద్భుతమైన శిల్పులు. ఈ సర్వ సృష్టికి ఒక ఆకారాన్నిచ్చేది వాళ్లు.

సృష్టిలో పలు కళాకృతులను సృష్టించేది వాళ్లిద్దరూ.

ఈ సృష్టిలో జీవించటానికి, జీవి ఆవిర్భవించటానికి అవకాశాలు కల్పించేది ఈశు.

సృష్టి ఆరంభమవుతోందని యెమోజా, ఒలోకున్‌లకు అర్థమయింది.

వారింతకాలం జీవాన్ని భద్రంగా కాపాడుతోంది ఈ క్షణం కొరకే. తమ ప్రేమనంతనూ రంగరించి, సాగరంలా మార్చి, ఆ సాగరంలో జీవాన్ని సంరక్షిస్తూ వచ్చారు.

ఒబాతల, ఒడూడువాలు ఏకాగ్రతతో పని ఆరంభించారు.

అనంతమైన ప్రేమసాగరంలోని పరిమిత పరిధి కల నీటి సాగరాన్ని చెక్కటం ప్రారంభించారు.

వారు సాగరాన్ని చెక్కటం పూర్తయింది. ఏకాగ్రతతో వారినే చూస్తున్న యెమోజా ఒలాకున్‌లను చూసి నవ్వారు.

'ఇప్పుడు జరిగేది ఎవ్వరూ ఊహించలేదు. అనంతం నుంచి పరిమిత పరిధి కల సృష్టి జరుగుతోంది. కానీ ఇందువల్ల అనంతానికి ఎలాంటి నష్టంలేదు. చూడండి' అన్నారు.

ఎక్కడో కళ్లు మిరుమిట్లు గొలిపే మెరుపు మెరిసింది.

అనంతంలో ఎక్కడో ఏదో మహాద్భుతమైన విస్ఫోటనం జరిగినట్టుంది.

అనంతం నుంచి ఒక బంగారు రంగు కాంతిపుంజం కిందకు వ్యాపిస్తోంది. చీకటిని చీల్చుకుండా ప్రయాణిస్తున్న ఆ కాంతిపుంజం ఓ కాంతి ప్రవాహంలా ఉంది.

ఇంతలో శిల్పులు వేరుచేసి సృష్టించిన సాగరం సుళ్లు తిరుగుతూ ఆ కాంతి ప్రవాహంలోకి జారిపోసాగింది.

'అయ్యో' అంది యెమోజా అప్రయత్నంగా.

వొంగి తననుండి వేరవుతున్న సముద్రాన్ని అందుకోబోయింది.

చిత్రంగా ఆ వెలుగు ప్రవాహం ఆమెనీ తనలోకి ఆకర్షించింది. ఇనుమును అయస్కాంతం ఆకర్షించినట్టు ఆమెను ప్రవాహం ఆకర్షించింది. యెమోజా ప్రవాహంలో కొట్టుకుపోసాగింది.

ఎటుచూసినా వెలుతురు అలల్లా ఎగసిపడుతోంది. నీటిలో ప్రవహిస్తోంది. ఇదంతా చూస్తూంటే అత్యంత ఆనందంగా అనిపిస్తోంది యెమోజాకు. ఆ ప్రవాహంలో కొట్టుకుపోతున్న ఆమె చాలాసేపటివరకూ ఒలాకున్ తనతో రావటంలేదని గ్రహించలేదు.

అంతవరకూ ఆనందిస్తున్న ఆమె ఒలాకున్ తనతో రావటంలేదని తెలియగానే ఒకరకమైన భయానికి గురయింది. బాధ కలిగింది.

ఆమెకు ఇక ముందుకు వెళ్లాలనిపించలేదు. కానీ ఆమె ప్రమేయం లేకుండా కాంతి ప్రవాహం ఆమెని తనతో తీసుకునిపోతోంది.

ఆమెకు చైతన్యం నశిస్తోంది. కాలం స్పృహ అడుగంటుతోంది.

ఎటుచూసినా వెలుతురు.

విశ్వం వెలుగుమయం అయిపోయినట్టుంది.

ఆమెకు స్పృహ తప్పింది. ఆమె అచేతనమైపోయింది.

***********

ఆమెకు స్పృహ వచ్చేసరికి ఏదో నూతనశక్తి ఆమెలో ప్రవేశించినట్టుంది.

ఏదో విజ్ఞానం, అంతవరకూ ఆమెకు పరిచయం లేనిది ఆమెలో నిండినట్టు అనిపించింది. అంతవరకూ ఆమెకు స్థల, కాలాల స్పృహలేదు. ఇప్పుడు ఆమెకు స్థలం తెలుస్తోంది. కాలం తెలుస్తోంది.

పగలు తెలుస్తోంది. చీకటి తెలుస్తోంది.

అయితే ఆమెకు తెలియదు, ఆమె చైతన్యం కోల్పోయినప్పుడు ఒడూదువా, ఆమె ఉపచేతనలో ప్రపంచానికి సంబంధించిన విజ్ఞానాన్ని నింపాడు. ఇక్కడే సృష్టిని చెక్కిన శిల్పుల గొప్పతనం తెలుస్తుంది. కళ్లుతెరచి ప్రపంచాన్ని చూస్తూండటం వల్ల గ్రహించిన విజ్ఞానం వేరు. ఉపచేతనను స్పందింపచేసి దాని నుండి గ్రహించే విజ్ఞానం వేరు. బాహ్య ఇంద్రియాల ద్వారా అందిన విజ్ఞానం ద్వారా ఉపచేతనలోని విజ్ఞానాన్ని గ్రహించాలన్న తపన యెమోజాలో కలిగింది. అది కుదరక ఏదో అసంతృప్తి కలిగింది ఆమెలో.

అంతలో ఆమెకు ఒలోకున్ గుర్తుకువచ్చాడు.

ఏడీ ఒలోకున్?

తాను ఎక్కడినుంచి వచ్చింది? ఆమెకేదో గుర్తుకువచ్చి గుర్తుకు రానట్టు అనిపిస్తోంది.

ఏవేవో అస్పష్టమైన జ్ఞాపకాలు కదలుతూ అలజడి సృష్టిస్తున్నాయి.

అయితే ఆమెకు బాగా గుర్తున్నది మాత్రం ఒలోకున్! తానూ ఒలోకున్ అవిభాజ్యమైన అంగాలవంటివారు.

రెండు శరీరాలలోని ఒక ప్రాణం! ఏడీ ఒలోకున్!



ఒలోకున్‌కు సంబంధించిన జ్ఞాపకాలు తప్పించి మరేమీ లేవా తన దగ్గర? ఒలోకున్ గుర్తులేవీ లేవా? ఒలోకున్ నిజంగా ఉన్నాడా? తన ఊహేనా? ఆమె కళ్లల్లోంచి నీళ్లు జలజల రాలసాగాయి.

ఆమె శోకానికి ప్రకృతి కదలిపోసాగింది.

భూమిపై శిల్పులు చెక్కిన పలు ఆకృతులు ఆమె రోదనకు స్పందించసాగాయి. ఆమె ఏడుస్తూ కొండనెక్కింది. ఎత్తయిన కొండవైపునుంచి ఎంతదూరం కనిపిస్తుందో అంతదూరం చూసింది.

ఒలోకున్ జాడలేదు. ఒలోకున్ దుఃఖంలో ఆమె ఓ సంగతి గమనించటం మరచిపోయింది. అనంతాన్ని చూడటానికి అలవాటు పడిన ఆమె కళ్లు ఇప్పుడు ఎంతో దూరం చూడలేకపోతున్నాయి.

నిశ్శబ్దంలో శబ్దాలను వినేందుకు అలవాటయిన ఆమె చెవులు ఇప్పుడు మామూలూ శబ్దాలను వినగలుగుతున్నాయి.

ఆమె రోదనకు కరుణించి 'ఒలోద్యుమార్' ఆమెకు ప్రత్యక్షమయ్యాడు. 'అనంతకాలం ఒలోకున్‌తో కలసి సుఖించిన నీకు ఆ ఆకారం తాలూకు గుర్తులు లభిస్తాయి. ఒలోకున్ నీ అంతర్గత శక్తి' అన్నాడు.

దైవం మాటలు ఆమెకు సంపూర్ణంగా అర్థంకాలేదు. కానీ ఎంతో ప్రశాంతంగా అనిపించింది. ఆనందంగా అనిపించింది. ఆమె రోదన ఆపి చుట్టూ చూసింది. అప్పటికే ఆమె కన్నీళ్లు కాల్వలై, భూమిపై శిల్పులు చెక్కిన గుంటలు, లోతట్టుప్రాంతాలలో నిండాయి. సముద్రాలు ఏర్పడ్డాయి.

ఆమె మరింతసేపు ఏడిస్తే భూమిపై జలం తప్ప పొడినేల మిగలదనని దేవుడు ప్రత్యక్షమై ఆమెకు సంతోషం కలిగించాడు.

భూమిపై నిండిన జలాలలో యెమోజా, ఒలోకున్‌ల ప్రేమ సూచకంగా పలుజీవులు అవతరించాయి. సర్వ జీవాలకు యెమోజా మాత అయింది.

**********

ఆఫ్రికా దేశంలోని యొరుబా మతం వారు యెమోజాను పూజిస్తారు.

ఆమె 14మంది యొరుబా దేవతలకు జన్మనిచ్చిందని భావిస్తారు. యెమోజా ఒలోకున్‌ల ప్రేమ ఫలితం ఈ ప్రపంచం అని భావిస్తారు. ప్రతి సంవత్సరం యెమోజా పాటలు పాడుతూ నదులను యెమోజా ప్రతిరూపాలుగా భావించి పూజిస్తారు.

యెమోజామాయేలె వో మాయెలేవో,

యెమోజా యెమోజా మాయేలే వోవో

మాయేలే ఓల్ యెమోజా' అన్న పాటతో ఆఫ్రికా దేశాలు ప్రతిధ్వనిస్తాయి. యెమోజా సంతోషిస్తుంది. 

# తక్కువ కాలంలో ప్రపంచ పర్యటన!



అమెరికాకు చెందిన కాసీ డె పెకాల్ అతి తక్కువ కాలంలో 196 దేశాలు సందర్శించిన యువతిగా రికార్డు సాధనే తన లక్ష్యంగా ఎంచుకుంది. ఆమె వయసు 27 సంవత్సరాలు. ఆమె లక్ష్యంలో ఇప్పుడు సందర్శించ వలసినవి కేవలం 16 దేశాలే మిగిలాయి. కాలమేమో 45 రోజులుంది. జూలై 2015లో అదీ తన 25వ పుట్టినరోజున తన పర్యటన ప్రారంభించింది. ఇప్పటివరకు 180 దేశాలు సందర్శించింది. ఆమె ప్రయాణించిన విమానాల సంఖ్య 254. సుమారుగా ఇంకా 26 విమానాలు ఎక్కవలసింది ఉంది అంటోందామె. ఆమె ప్రయాణాలకు అయిన ఖర్చు 198,000డాలర్లు. టూరిజం అండ్ స్కాల్ ఇంటర్నేషనల్‌కు చెందిన చెందిన ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పీస్‌కు పీస్ అంబాసిడర్‌గా ఉన్న కాసీ పని పరంగా రెస్పాన్సిబుల్ టూరిజం అండ్ ఎకనామిక్స్ గురించి యూనివర్సిటీ టూరిజం స్టూడెంట్లతో చర్చిస్తుంది కూడా. అంతేకాదు అడ్వెంచరర్స్ అండ్ సైంటిస్ట్స్ ఫర్ కన్జర్వేషన్‌తో కూడా పనిచేస్తోంది. అందులో భాగంగానే ఆమె నీటిలో మైక్రో ప్లాస్టిక్‌ల ఉనికిని పరీక్షించటానికి నీటి శాంపిల్స్‌ను సేకరిస్తోంది. తనకు బాల్యం నుంచి ప్రపంచంలోని ప్రతి దేశాన్ని సందర్శించాలని ఎంతో కోరిక అని, తద్వారా ప్రతి ప్రాంతం గురించి, వారి వారి సంస్కృతుల గురించి తెలుసుకోవాలన్నది తన ఆకాంక్ష అని ఆమె చెపుతోంది. అమెరికాలో ప్రపంచంలోని వివిధ దేశాల, వివిధ సంస్కతుల వారు ఉండటం తమ అదృష్టమని అంటుందామె. తమ పూర్వీకులు యూరప్‌కు చెందినవారని, అందుకే తన మూలాల గురించి వివరంగా తెలుసుకోవాలన్నది తనకోరిక అంటుందామె. అమెజాన్ కానీ ఇతర ఏ ప్రాంతమైనా కాని వార్తల్లో చెప్పినట్లే ఉంటుందా, వేరుగా ఉంటుందా అన్నది తెలుసుకోవటమెంతో ఆసక్తికరమంటుందామె. 15 నెలల తన ప్రయాణంలో రకరకాల అనుభవాలెదు రయ్యాయని, అందునా తాను మహిళనైందున కొన్ని ఇబ్బందికర పరిస్థితులను ఎదుర్కోవలసివచ్చిందంటుందామె. తన ఈ పర్యటనలకు ఎందరో స్పాన్సర్లు సాయపడ్డారంది. తన ఈ ప్రపంచ పర్యటన నేటి యువతకు స్ఫూర్తినిస్తుందని ఆశిస్తున్నానంటుందామె. ఇప్పటివరకు ఆమె చూసిన దేశాల్లో ఇండియా కూడా ఉంది. సకాలంలో కాసీ తన లక్ష్యం సాధించి రికార్డు సృష్టించాలని ఆకాంక్షిద్దాం. 

## దారి చూపుతారా



## రంగులు వేయండి



# ఏడు ప్రశ్నలు

కథ

విక్రమపురి రాజు ధర్మాంగదుడు. అతడి మంత్రి భుజవర్మ మహామూర్ఖుడు. ఆ మూర్ఖత్వంతో వితండవాదం చేస్తూ రాజుని చిరాకుపరిచేవాడు. తన తాతకాలంనాటివాడు, వృద్ధుడైనాడు, చాదస్తం అని రాజు అతడిని ఏమీ అనకపోయినా, తెలివైన మంత్రిని నియమించుకోవాలనుకున్నాడు. రాజగురువు సలహా కోసం ఆయన ఆశ్రమానికి వెళ్లి 'గురు వర్యా! నాకు రాజ్య భారం ఎక్కువైంది. భుజవర్మకి చాదస్తం ఎక్కువైంది. ప్రతిదీ అడ్డగోలుగా వాదించి విసుగుతెప్పిస్తున్నాడు. ఏంచేయాలో తోచటంలేదు' చెప్పాడు.



అందుకు రాజగురువు 'త్వరపడకు రాజా! నేను ఏడు ప్రశ్నలు రాసిస్తాను. వాటికి జవాబు ఇచ్చినవారినే నీవు మంత్రిగా నియమించుకో, ప్రతిపల్లెలో దండోరా వేయించు. కేవలం ఏడురోజుల్లో వాటికి జవాబులివ్వాలని , చెప్పలేనివారికి ఐదువేల బంగారు నాణేలు జరిమానాగా విధిస్తామని కూడా చెప్పండి' వివరించాడు.

'దాని వల్ల ఏంలాభం గురూజీ?' ప్రశ్నించాడు రాజు.

'రాజ్యంలోని ప్రతివారూ ప్రయత్నించినా శిక్షకు భయపడి ముందుకు ఎవరూ రారు. కేవలం బుద్ధిచాతుర్యం గలవాడే ముందుకొస్తాడు' అన్నాడు.

రాజు అదేవిధంగా పల్లెపల్లెలో దండోరా వేయించాడు. రోజులు గడుస్తున్నాయి. కానీ ఎవరూ ముందుకురావటం లేదు. నా రాజ్యంలో ప్రతిభ, బుద్ధికుశలత గలవారే లేరా?' రాజు బాధపడసాగాడు.

ఒకటీ, రెండు ప్రశ్నలకు కొంతమంది జవాబు ఈయగలిగారు కానీ..అన్నిటికీ ఎవరూ ముందుకు రాలేదు. రాజు నిరాశపడ్డాడు.

ఒకరోజు గొర్రెలకాపరి గోపాలుడు 'నేను జవాబులు చెప్తా' అని రాజు ముందుకొచ్చాడు. అతణ్ని చూస్తూనే రాజు పెదవి విరిచాడు. అయినా, ప్రశ్న అడిగాడు. 'మేక పెంటికలు గుండ్రంగా ఎందుకుంటాయి?'

'వాయువు వల్ల' గొల్లవాడు బదులిచ్చాడు.

నా రెండోప్రశ్న..'రావి ఆకు కాడ పెద్దదిగా ఉంటుందా, ఆకు పైభాగమా?

'రెండూ సమానమే రాజా!'

మూడో ప్రశ్న..'ఉడుత శరీరంపై ఎన్ని నల్ల, తెల్లగీతలుంటాయి? దాని శరీరం పొడవుగా ఉంటుందా లేక దాని తోకనా?'

రాజా! నల్ల, తెల్లగీతలు సమంగానే ఉంటాయి. దాని శరీరం, తోక సమాన పొడవులో ఉంటాయి' బదులిచ్చాడు.

'రాజుకి ఎంతమంది తండ్రులుంటారు' నాలుగో ప్రశ్న అడిగాడు.

'ప్రభూ! ఒకరాజుకి ఐదుగురు తండ్రులుంటారు. వారు రాజు, కుబేరుడు, వేటగాడు, దొంగ, తేలు'.

అదెలాగా?' ఆశ్చర్యంగా రాజు అడిగాడు.

రాజుకి మొదటి తండ్రి కన్నతండ్రి అయిన రాజే. దానం చేయడంలో అతడు కుబేరుడితో సమానం. అందుకే కుబేరుడు రెండో తండ్రి. క్రూరత్వంలో వేటగాడితో సమానం. కొన్ని దొంగిలిస్తాడు కాబట్టే చోరుని కొడుకు. నిద్రించి లేచేటప్పుడు కర్రకొసను







# తెనుగు బాలల మ్యాగజైన్

## వార్త ఆదివారం

పుచ్చుకుని లేస్తాడు కాబట్టి తేలు అతని తండ్రి'.

రాజు అతడి శక్తి,సామర్థ్యాలను పరీక్షించాలనుకున్నాడు. 'సరే నీవు నీ పల్లెకు వెళ్లిపో. మిగతా మూడు ప్రశ్నలు నేను నీ ఇంటికే పంపుతాను. వాటికి జవాబివ్వలేక పోతే జరిమానా చెల్లించవలసి ఉంటుంది' అన్నాడు.

మర్నాడు రాజు, గోపాలుడికి ఒక ప్రశ్నపంపాడు.అది..'పల్లె బైట ఉన్న శిలతో మండపం తయారుచేయాలి'.

పల్లెవాసులంతా ఉలిక్కిపడ్డారు.

గోపాలుడు నవ్వేస్తూ ఎందుకు భయపడతారు. ఈ శిల నాల్గువైపులా లోతుగా తవ్వి నాలుగుమూలలా స్తంభాలుపాతుదాం. అప్పుడు శిల దానిపై నిలబడుతుంది మంటపంలా. అంతా అలాగే చేశారు. అది చూసి రాజు మనసులోనే మెచ్చుకున్నాడు. కొన్నాళ్ల తర్వాత ఒకమేకను పంపి 'ఒక నెలతర్వాత కూడా దీని బరువు ఇలాగే ఉండాలి' అన్నాడు.

గోపాలుడు మేకని ఊరిబైట చెట్టుకి కట్టేసి రోజూ తనతో ఒక తోడేలుని తెచ్చేవాడు. మేక ఎంత తిన్నా,తోడేలు భయంతో బరువెక్కలేదు. ఏడో ప్రశ్నగా ఒక కోడిపుంజుని పంపి, 'వేరే పుంజుతో పందెం పెట్టకుండా, దీన్ని పందెం కోడిగా మార్చాలి' అన్నాడు.

గోపాలుడు పుంజు ఎదురుగా అద్దం పెట్టించాడు. అది తన ప్రతిబింబాన్ని చూసి, శత్రువనుకొని ఎగిరెగిరి పొడిచి మంచి పందెంపుంజుగా తయారైంది. గోపాలుడు దాన్ని రాజువద్దకు తీసుకెళ్లాడు.

రాజు, గోపాలుడి తెలివికి సంతోషించి తన కుడిభుజంగా భావించి, కొలువులో చేర్చుకున్నాడు.

**-అచ్యుతుని రాజ్యశ్రీ**
హైదరాబాద్.

## హలో ఫ్రెండ్...



**చిన్నారుల ప్రశ్నలకు**

**వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్**

**గిరీష్ అంకుల్ సమాధానాలు**

**జి.కిరణ్‌కుమార్, మహబూబ్‌నగర్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. మానవ శరీరంలోని రక్తంలో వేర్వేరు భాగాలున్నాయా? ఉంటే అవి ఏమిటి? దయచేసి వివరించండి?**

**జవాబు:** కిరణ్ కుమార్! రక్తమనేది ద్రవరూప కణజాలం. దీనిలో ప్లాస్మా, ఎర్ర రక్త కణాలు, తెల్లరక్తకణాలు, రక్తఫలికలు అనే భాగాలున్నాయి. ప్లాస్మాలో 90శాతం నీరు ఉంటుంది. హార్మోన్‌లు, యూరియా, ప్రోటీన్‌లు, పోషకాలు, వ్యర్థపదార్థాలను ఇది రవాణా చేస్తుంది. ఎర్రరక్తకణాలు (ఎరిత్రోసైట్స్) గుండ్రంగా, బల్లపరుపుగా, ద్విపుటాకారంగా ఉంటాయి. వీటిలో కేంద్రకం ఉండదు. హిమోగ్లోబిన్ అనే రంగు పదార్థం ఉండటం వల్ల ఇవి ఎర్రగా ఉంటాయి. హిమోగ్లోబిన్ శ్వాసక్రియలో ముఖ్యపాత్ర వహిస్తుంది. మనిషిలో ఒక క్యూబిక్ మి.మీ.కు 4.5 నుంచి 5.5 మిలియన్ ఎర్రరక్తకణాలు ఉంటాయి. ఇవి ఎముక మజ్జలో ఉత్పత్తి అవుతాయి. ఇవి 100 రోజుల నుంచి 125 రోజుల వరకు జీవిస్తాయి. తెల్లరక్త కణాలు (ల్యూకోసైట్స్) హానికరమైన వ్యాధికారక క్రిములను నాశనం చేస్తాయి. వీటిలో కేంద్రకం ఉంటుంది. ఇవి వ్యాధికారక క్రిములనుంచి రక్షిస్తాయి. మనిషిలో ఒక క్యూబిక్ మి.మీ.కు 4 నుంచి 11 లక్షల తెల్లరక్తకణాలుంటాయి. వీటి సంఖ్య ఎర్రరక్త కణాల కంటే బాగా తక్కువ. రక్తఫలికల (త్రాంబోసైట్స్)లోనూ కేంద్రకం ఉండదు. రక్తం ఘనీభవించే ప్రక్రియలో ప్రధానపాత్ర వహిస్తాయి. రక్తం ఘనీభవించడం వల్ల గాయాలనుంచి రక్తం స్రవించకుండా నిలిచిపోతుంది.

**కె.రజని, విజయనగరం.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్కారాలు. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. ప్రపంచంలో ఎన్నో మహా సముద్రాలు ఉన్నాయి కదా. అయితే అన్నిటిలోకి అత్యంత లోతైన సముద్ర ప్రాంతం ఏది? దయచేసి చెప్పండి.**

**జవాబు:** రజనీ! పసిఫిక్ మహా సముద్రంలోని ఛాలెంజర్ డీప్ ప్రపంచంలోని ఇతర మహాసముద్రాలలోని లోతైన ప్రాంతాలకన్నా లోతైనది. ఈ ప్రాంతం పశ్చిమ పసిఫిక్‌లో గుయాం దీవి సమీపంలో మారియాన్స్ ట్రెంచ్‌లో ఉంది. 11 కి.మీ. లోతు ఉండే ఈ ప్రాంతం ఎవరెస్ట్ పర్వతం ఎత్తును మించిన లోతులో ఉంది. బ్రిటీష్ సర్వే నౌక ఛాలెంజర్-II ఈ అతిలోతు ప్రాంతాన్ని 1951లో ప్రప్రథమంగా కనుగొంది. అందువల్లే దీనికి ఛాలెంజర్ డీప్ అని పేరు పెట్టారు.



# గర్వకారణ గండికోట!

## (గ్రాండ్ కాన్యన్ ఆఫ్ ఇండియా)


గండికోట ప్రవేశ ద్వారం

**గండికోట అనగానే 'గండికోట రహస్యం' సినిమా గుర్తుకు రావడం సహజం. గండికోట పేరులోనే ఎంతో గాంభీర్యం, రాజసం ధ్వనిస్తుంది. తెలుగునేల నెలకొన్న గండికోట రూపురేఖలు, చారిత్రక విశేషాలు ఇక్కడ...**



**సహజంగా ఏర్పడిన గండి రెండుదిక్కులా రక్షణనివ్వగా, మరో రెండువైపుల లోతైన కందకాలతో, 40 అడుగుల ఎత్తయిన గోడలతో శత్రుదుర్భేధ్యంగా నిర్మించిన గండికోట ఆంధ్రప్రదేశ్‌కు తలమానికంగా నిలుస్తోంది. కర్నాటకలోని నందికొండల్లో పుట్టి ఆంధ్రప్రదేశ్ లోకి ప్రవహించే పెన్నా (పినాకిని) నది రెండు కొండల మధ్య ప్రవహించడం వల్ల ఏర్పడిన పెద్ద గండి పైభాగాన నిర్మించడం వల్ల ఈ కోటకు గండికోట అనే పేరు వచ్చింది.**


పెన్నాలోయ

క్రీ.శ.12వ శతాబ్దం నుంచి 800 సంవత్సరాలు వివిధ రాజవంశాల పాలనలో గండికోట దుర్గం విరాజిల్లిందని చెప్పవచ్చు. చాళుక్యరాజైన త్రైలోక్యమల్లుడు కల్యాణి పట్టణాన్ని రాజధానిగా చేసుకొని పాలిస్తున్న సమయంలో, అతని ప్రతినిధి అయిన కాకరాజు గండికోటను నిర్మించినట్లు మెకంజి కైఫియత్తుల ద్వారా తెలుస్తోంది.

కడప జిల్లా జమ్మల మడుగుకు 15 కిలో మీటర్ల దూరంలో ఉన్న గండికోటను క్రీ.శ.1123 ప్రాంతంలో నిర్మించారు. ఈకోట దాదాపు ఏడునుంచి ఎనిమిది దశాబ్దాల పాటు కల్యాణి చాళుక్యుల ఆధీనంలో ఉండి తర్వాత కాకతీయుల వశమైంది. కాకతీయ ప్రభువు గణపతి దేవుడు తన ప్రతినిధిగా గండికోటలో గంగయసాహిణిని నియమించాడు. ఈయన తర్వాత జమ్మిగ దేవుడు, తిలపురాధి దేవుడు, అంబదేవుడు, రెండవ తిలపురాధి దేవుడు తదితరులు కాకతీయుల ప్రతినిధులుగా గండికోటను పాలించారు. వీరిలో అంబదేవుడు ప్రసిద్ధుడయ్యాడు. ఈయన 1279 నాటికి కడపజిల్లా వల్లభాపురం (నేటి వల్లూరు)ను రాజధానిగా చేసుకొని గండికోటను పాలించినట్లు అత్తిరాల శాసనం వల్ల తెలుస్తోంది. తర్వాత అంబదేవుడు తన పాలనను వల్లభాపురం నుంచి గండికోటకు మార్చినట్లు క్రీ.శ.1290లో ప్రకాశం జిల్లా త్రిపురాంతకం వద్ద వేయించిన శాసనంలో పేర్కొన్నారు. శతాబ్ద కాలపు కాయపు వంశస్థుల పాలన అనంతరం విజయనగర రాజులు గండికోటను తమ అధీనంలోకి తెచ్చుకొని మూడు శతాబ్దాల పాటు తమ సామ్రాజ్యంలో అంతర్భాగంగా చేసుకున్నారు.

శ్రీకృష్ణదేవరాయలు, అచ్యుతరాయలు, సదాశివరాయలు తదితరుల కాలంలో వారి సామంతులుగా పెమ్మసాని వంశస్థులు గండికోటను 300 ఏళ్లపాటు పాలించారు. క్రీ.శ.1565లో రామరాయలను, కులీకుతుబ్ షా ప్రతినిధి మీర్‌జుమ్లా జుల్ఫికర్ మోసం చేసి ఓడించడంతో గండికోట కులీకుతుబ్ షా వశమైంది.

క్రీ.శ.1687లో ఔరంగజేబు గోల్కొండను జయించడంతో కోట మొగలుల ఆధీనంలోకి వెళ్లింది. అనంతరం క్రీ.శ.1717 నుంచి 1779 వరకు మొగలుల సుబేదార్లు , సామంతులు, మయానా వంశస్తులైన కడప నవాబులు గండికోటను పాలించారు. తర్వాత మైసూరు సుల్తానులు, హైదరాబాద్ నిజాం ప్రభువుల పాలనలోకి వెళ్లింది. ఎంతోమంది రాజులు, సుల్తానులు పాలించడంతో గండికోటలో హిందూ, ముస్లిం సంప్రదాయాల పాలనకు ఎన్నో సాక్ష్యాలు కనిపిస్తాయి.

### శత్రుదుర్భేధ్యమైన కోట..


కావలిమండపం

గండికోట సముద్రమట్టానికి సుమారు 1670 అడుగుల ఎత్తున నిర్మితమైంది. కోట ప్రాకారాలు చుట్టూ సుమారు అయిదు మైళ్ల విస్తీర్ణంలో ఉన్నాయి. ఒక్కోరాయి ఒక టన్ను బరువున్న పెద్ద బండరాళ్లతో 40 అడుగుల ఎత్తున కోట గోడలు ఇప్పటికీ చెక్కుచెదరక అబ్బురపరుస్తాయి. కోటగోడలపై 101 బురుజులు, లోతైన కందకాలు, మలుపులు తిరిగిన రక్షణ గోడలు, నగరాఖానా, కావలి మండపాలతో పటిష్టమైన భద్రతతో శత్రు దుర్భేద్యంగా ఉన్నట్లు మనకు తెలుస్తుంది. కోట ప్రవేశద్వారం 20 అడుగుల ఎత్తయిన తలుపులు, వాటికి పెద్దపెద్ద వాడి అయిన ఇనుప గుబ్బలు అమర్చి, మదపుటేనుగులకు సైతం లొంగని విధంగా ఏర్పాటుచేశారు.

కోట ఆవలవైపున కొన్ని మైళ్ల దూరాన ఉన్న శత్రువులను సైతం కనిపెట్టేందుకు వీలుగా ప్రవేశ

ద్వారానికి దగ్గరలో నాలుగు అంతస్తులతో నిర్మించిన కావలి మండపం ఇప్పుడే నిర్మించారా అనుకునేంతగా చెక్కుచెదరక ఠీవిగా కనిపిస్తుంది.

**ఆలయాలు:** గండికోటలో అద్భుత శిల్పసంపదతో అలరారే మాధవరాయ స్వామి ఆలయం ఇప్పటికీ చూపరులను ఆకట్టుకుంటుంది. రఘునాథ (రంగనాథ) ఆలయం ఎర్రరాతి శిల్ప స్తంభాలతో నిర్మితమైనా శత్రురాజుల దాడుల కారణంగా దెబ్బతింటూ వచ్చి, ప్రస్తుతం శిధిలావస్థకు చేరుకుంది. దాంతో కోటలో మాధవరాయస్వామి ఆలయం తలమానికంగా నిలుస్తోంది.

ఈ ఆలయం నాలుగు అంతస్తుల గోపురంతో విశాలమైన ఆవరణం, శిల్పసంపదతో కూడిన అనేక స్తంభాల మండపంతో ఉంది. గోపురం ప్రవేశద్వారాల వద్ద నాట్యభంగిమల్లో ఉన్న శిల్పాలు, లతలు, పద్మాలు, గుర్రాలు, ఏనుగులతో అద్భుత శిల్పకళకు తార్కాణంగా నిలుస్తాయి.


చెక్కుచెదరని కోటగోడలు

ఇవికాక గుర్రపు శాలలు, ధాన్యాగారం, కారాగారం, జుమా మసీదు, రాయల చెరువు, ఎర్రకోనేరు కోటలో చూడదగ్గవి. కోటలోని అనేక శిల్పాలు, కత్తులు, ఫిరంగి శకలాలను కోటకు సమీపంలోని మైలవరం రిజర్వాయరు వద్ద ఏర్పాటు చేసిన మ్యూజియంకు తరలించారు. కొన్నేళ్ల కిందట గండికోటను ప్రభుత్వం వారసత్వ సంపదగా గుర్తించి, పురావస్తు శాఖకు అప్పగించింది.


మాధవరాయస్వామి ఆలయం

**గ్రాండ్ కాన్యన్ ఆఫ్ ఇండియా:**

అమెరికాలోని అరిజోనా రాష్ట్రంలో కొలరాడో నది, అక్కడి ఎర్రకొండల మధ్య ప్రవహించడంతో సహజంగా ఏర్పడిన లోయ ప్రపంచ ప్రఖ్యాతిగాంచింది. ప్రస్తుతం అది పర్యాటకులను ఎంతో ఆకర్షిస్తోంది. అరిజోనాలోని గ్రాండ్ కాన్యన్ అంత పెద్దది


ధాన్యాగారం

కాకపోయినా గండికోట వద్ద పెన్నానది ప్రవాహం వల్ల ఏర్పడిన ఈలోయను 'గ్రాండ్ కెన్యన్ ఆఫ్ ఇండియా'గా చరిత్రకారులు పేర్కొన్నారు. అయితే దురదృష్టవశాత్తూ గండికోట లోయ తెలుగు రాష్ట్రాలలోని వారికి దేశంలోని వారికే పెద్దగా తెలియకుండా ఉంది. ఉత్తరం, తూర్పు దిక్కుల్లో కోటకు తవ్విని కందకంలా ఉంటూ రక్షణగా ఉన్న ఈ లోయ వంటిది అమెరికాలో మినహా మరెక్కడా లేకపోయినా పర్యాటకులకు తెలియక పోవడం బాధాకరమే. అయినా ఈ లోయ తెలుగురాష్ట్రాల ప్రజలకు గర్వకారణమని చెప్పవచ్చు.


జుమా మసీదు

**రాష్ట్రపండుగగా గండికోట ఉత్సవాలు:**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గండికోటను గొప్ప పర్యాటక ప్రదేశంగా తీర్చిదిద్దేందుకు చర్యలు చేపట్టింది. ఇందులో భాగంగా పర్యాటక శాఖ కోట వెలుపల వసతి గృహాలను ఏర్పాటుచేసింది. గత ఏడాది సెప్టెంబరులో గండికోట ఉత్సవాలను ఏటా కొనసాగిస్తామని ప్రకటించిన ప్రభుత్వం ఈ ఏడాది నవంబర్‌లో గండికోట ఉత్సవాలను రాష్ట్ర పండుగగా నిర్వహిస్తామని ప్రకటించింది. ఇందుకోసం అధికారులు ఏర్పాట్లు చేస్తున్నారు.

**రవాణా, వసతి:**

గండికోట, జిల్లా కేంద్రం కడపకు 87 కిలోమీటర్ల దూరంలో ఉంది. జమ్మలమడుగు నుంచి 15 కిలోమీటర్ల దూరంలో ఉన్న గండికోటకు ప్రతిరోజు జమ్మలమడుగు ఆర్టీసీ డిపోనుంచి బస్సులు నడుస్తాయి. జమ్మలమడుగులో, గండికోటకు 35 కిలోమీటర్ల దూరంలోని ప్రొద్దుటూరులో పర్యాటకులకు వసతి సౌకర్యం దొరుకుతుంది.

వ్యాసం, ఫొటోలు:
తోట రామమోహన్

# కారుణ్యమంటే అదీ..



మనదేశంలో ప్రాణాపాయంలో ఉన్న మనుషులకే అంబులెన్స్ సర్వీసులు సమయానికి ఆదుకోవటం అంతంతమాత్రమే. కానీ సౌతాంప్టన్‌లో మంటల్లో చిక్కుకున్న గినీపందిని ఓ అంబులెన్స్ టీమ్ రక్షించింది. పొగ బారిన పడిన ఆ గినీ పందికి ఆక్సిజన్ మాస్క్ అమర్చి అది కోలుకునేలా చేశారు. ఆ ఇంట్లో మంటలను ఆర్పడానికి అగ్నిమాపక దళానికి ఓ గంట సమయం పట్టిందట. గ్రే-బ్లాక్ కలర్‌లో పొడవాటి జుట్టుతో ఉన్న ఆ గినీపంది పేరు బోల్ట్. దీని ఫొటోను ఫేస్‌బుక్‌లో సైతం ఉంచారట. హాంప్‌షైర్‌లోని ఓ ఇంట్లో అగ్నిప్రమాదం సంభవించటంతో ఎల్లో టీమ్ బృందం అక్కడికి వెళ్లారు. అక్కడ ఉన్నవారంతా క్షేమంగానే ఉన్నా, ఈ గినీ పందిమాత్రం పొగకు ఉక్కిరిబిక్కిరై, వణికిపోతూ, భారంగా శ్వాస తీసుకుంటూ కనిపించిందట. వెంటనే ఆ రెస్క్యూ బృందం వారు గినీపందిని తీసుకెళ్లి, ఆక్సిజన్ మాస్క్ ట్రీట్‌మెంట్ మొదలుపెట్టారు. త్వరలో బోల్ట్ పూర్తిగా కోలుకుంటుందంటున్నారు. ఏమైనా జంతువుల పట్ల వారు చూపిన శ్రద్ధను అభినందించాలి. అంతేకాదు, ఆ దయాగుణాన్ని మనం కూడా అలవరచుకోవాలి.




# ముసురు

– రాచపూటి రమేష్

**ఆకాశానికి చిల్లులు పడ్డట్టు వేయి ఏనుగులు తొండాలతో చిమ్మినట్లుగా కుండపోతగా ఒకటే వర్షం.**

**రెండు రోజుల నుండీ ముసురు పట్టిన ఆకాశం. బంగాళాఖాతంలో వాయుగుండమో, నైరుతి రుతుపవనమో తెలియదు మునెయ్యకు. అతనికి తెలిసిందల్లా రెండు రోజుల భారీ వర్షానికి తొగటపల్లె చెరువు పూర్తిగా నిండిపోయి, కట్ట తెగడానికి సిద్ధంగా వుందని.**

ఎదురింటి నుండి పరుగెత్తుకొని వచ్చి మునెయ్య పెంకుటింట్లోకి దూరేసరికే పూర్తిగా తడిసిపోయాడతని కొడుకు గోపి, ఒక ప్లాస్టిక్ కవర్‌లో ఏదో దాచుకొని తీసుకువచ్చాడు.

"ఏమిరా! బియ్యం సుజాత వాళ్లింటినుండి తెచ్చినావా?" అడిగింది మునెయ్య భార్య.

తెచ్చానని వాడు తల ఊపి, తాను తెచ్చిన బియ్యాన్ని నేలపై ఉన్న చేటలో కుప్పగా పోశాడు. ఇందిర ఆ బియ్యాన్ని చేటలో చెరగసాగింది.

మునెయ్య ఇంటిలో ఒక మూల జకార్డు అట్టలు బిగించిన మగ్గం వుంది. ఆ మగ్గంలో మునెయ్య నేస్తున్న వెంకటగిరి బుటా చీర పూర్తి కావస్తోంది. కానీ ఆ మగ్గం గుంటలో నీళ్లు వూరి పైవరకు వచ్చేస్తూ వున్నాయి. మునెయ్య ఇల్లు వున్న చేనేత కాలని పల్లపు ప్రాంతంలో వుంది. అక్కడ వర్షం పెద్దగా వస్తే నీళ్ల వూట వూరి, మగ్గంపై వున్న పడుగు పాడైపోతుంది. ఎనిమిది చీరల సాపు పూర్తయ్యేవరకూ మగ్గంపై వున్న నేత కోసి, చీరలు కోయడానికి సాధ్యపడదు. మునెయ్య అప్పటికి ఆరు చీరలు నేసి, ఏడవ చీర నేస్తూ వున్నాడు. ఇప్పుడు వూరుతున్న నీటివూట వల్ల మగ్గంపై వున్న చీరే కాక, మిగతా ఆరు చీరలు పాడైపోయే ప్రమాదం వుంది.

"చెరువుకట్ట తెగితే, నీళ్లు ప్రవాహంగా కాలనీలోకి వచ్చేస్తాయి. అప్పుడు పడుగూ, పేకలతోబాటూ మగ్గాలూ, ఇళ్లూ కూడా ధ్వంసం కావచ్చు" అనుకున్నాడు, మునెయ్య దిగులుగా.

మునెయ్య పక్క ఇంట్లో వున్న రెడ్డెప్ప తలపైన ఒక తుండుగుడ్డ వేసుకొని పరుగులాంటి నడకతో మునెయ్య ఇంట్లోకి వచ్చాడు.

"ఏం మునిబావా, మోడాలు పొయ్యేట్టుగా లేవు. నేత నాశినమయ్యేట్టుగా వుండాది" అన్నాడు భయంతో రెడ్డెప్ప.

"నాశినమయ్యేది కాదు, ఇప్పటికే పూర్తి నాశినమయ్యే వుండాది" అన్నాడు, మునెయ్య నిర్వికారంగా.

"ఊర్లో నూరు మగ్గాలుండాయి. ఈ దెబ్బతో మొత్తం పడుగు, పేక మటాషే. ఇంట్లో ఏమైనా నూలు, జరీ, వార్పులుంటే అటకమీదికి తోసెయ్యి" అన్నాడు రెడ్డెప్ప.

"ఉండే అరా, కొరా అటకమీదే వుండాయి. ఈ వెల్లువ దొంగోడొచ్చినట్లు ఎప్పుడో ఇంట్లోకి దూరేస్తుంది" అన్నాడు, మునెయ్య.

"నేను ధర్మవరం పట్టుచీర నేస్తావుండా. కాస్ట్లీ ఐటము, ఈ వానలకు ఏమౌతాదో, ఏమో! ఆసామి తీసుకుంటాడో లేదో అని ఒకటే భయంగా వుండాది" అన్నాడు రెడ్డెప్ప.

మునెయ్య, రెడ్డెప్ప లాంటి చేనేత కార్మికులకు పడుగు, పేక, జరీ ఇచ్చి వారితో చీరలు నేయించే షావుకార్లు ఆ పల్లెలో ఇద్దరున్నారు.

మరో ఇద్దరు ఆసాములు పక్కనుండే చిన్నపాటి పట్టణంలో వుంటూ ఆ పల్లెలో కొన్ని మగ్గాల్లో చీరలు నేయిస్తూ వున్నారు. నేతవాళ్లు ఆ చీరలు నేశాక, వారికి కూలీలిచ్చి, ఆ చీరలు ఆసాములు తీసుకు వెళ్లి, కార్లలో బెంగళూరు, హైదరాబాద్



లాంటి పట్టణాలకు తీసుకువెళ్లి అక్కడ దుకాణాదారులకు లాభసాటి బేరానికి అమ్ముకుంటూ వుంటారు. ఆ షాపులవాళ్లు తమ లాభాన్ని చేర్చుకొని, వినియోగదారులకు అమ్ముకుంటూ వుంటారు. దళారీలు లాభపడినా, మునెయ్యలాంటి చేనేత కార్మికుల పరిస్థితి 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' లా వుంది.



మునెయ్య కొడుకు మగ్గం గుంటలో వూరిన నీళ్లు ఒక చెంబుతో తోడి, ఇంటిబయట పారవేసి రాసాగాడు. కానీ ఎంత తోడినా ఆ మగ్గం గుంటలోకి పాతాళగంగలా నీళ్లు వుబికి వస్తూనే వున్నాయి.

"మా ఆసామి మగ్గం గుంటలో సిమెంటు వేసి ప్లాస్టరింగ్ చేయించకూడదా? అని అడుగుతున్నాడు" అన్నాడు, రెడ్డెప్ప.

మునెయ్య అతని వంక నిర్వికారంగా చూశాడు.

"రెడ్డెప్ప మాట్లాడుతున్నది ఆచరణయోగ్యం కాదని అతనికీ తెలుసు" అనుకున్నాడు.

"పద, ఒకసారి పొయ్యి మనోళ్లందర్నీ చూసేసొస్తాం" అన్నాడు, రెడ్డెప్ప.

మునెయ్య చూరుకు కట్టిన తాడుకు వేలాడదీసిన గొడుగును తీసుకొని, రెడ్డెప్పతోబాటూ వానలోనే బయలుదేరాడు.

అందరిళ్లల్లో ఒకటే పరిస్థితి. మగ్గాలోళ్ల ఇళ్లన్నీ పల్లపు ప్రాంతంలో వుండడంతో అందరిళ్లలోనూ నీటివూట కనిపిస్తోంది. కొంచెం ఎక్కువ.. తక్కువగా. అందరిళ్లలోనూ నూలు, జరీ, మగ్గంపై వున్న నేత పాడైపోయి వున్నాయి. అందరి మొఖాల్లో ఆరాటం, "ఆసామి తాము నేసిన చీరలు తీసుకొంటాడో? లేదో" అన్న ఆదుర్దా కనిపిస్తోంది.

ఒకవేళ షావుకారు ఆ చీరలను తీసుకోకపోతే, తమకు వాటిని నేసినందుకు కూలి కూడా దక్కదు. ప్రకృతి బీభత్సానికి తామే మూల్యం చెల్లించాలి.

ప్రజల్లో ఎక్కువ మంది మిల్లులనుండి తయారయ్యే గుడ్డలను కొంటూ తాము తయారు చేసే చీరలు, పంచెలు, ధోతీల్లాంటి వాటిపై తిరస్కార భావం చూపుతూ వున్నారు. ప్రభుత్వమూ భారీగా చిలప నూలును ఎగుమతి చేస్తూ నూలు, రేషం (సిల్కు నూలు) ధరలను ఇబ్బడి ముబ్బడిగా పెరిగేలా చేస్తోంది. నూలురేట్లు పెరిగినట్లు చేనేత కార్మికులకు మజూరీలు, చీరల ధరలు పెరగడం లేదు. ఫలితంగా చేనేత మగ్గంపై ఆధారపడి జీవించే కార్మికుల పరిస్థితి దుర్భరంగా తయారైంది.




చాలా మంది చుట్టుపక్కల వున్న పట్టణాలకు వలసపోయి చిన్న హోటళ్లలో పని చేస్తూనో, ఆటోలు తోలుకొంటూనో కాలం గడుపుతూ వున్నారు. చదువు కున్న యువకులు ఉద్యోగాలు దొరక్కపోయినా, అనువంశిక చేనేతలోకి రావడం లేదు.

అందరి మొఖాల్లో నైరాశ్యం, దిగులు గూడు కట్టుకొని వున్నాయి.

వర్షం తెరపి ఇచ్చాక, ప్రభుత్వం మగ్గాల్లో నష్టపరిహారానికి సర్వే చేయించింది. అన్ని కుటుంబాలకూ పాతిక కేజీల బియ్యం, నూనె, చక్కెర ఇచ్చారు. నష్టపరిహారం డబ్బు రూపంలో పొందిన కుటుంబాలు తక్కువ. నూలు మగ్గంనుండి వేరు చేసి ఇచ్చినవారికి నాలుగువేల రూపాయలు చెల్లించారు. మిగిలినవారు ఆసామి తమ చీరలను కొనుగోలు చేస్తాడేమోనన్న వుద్దేశంతో నూలు, నేత మగ్గంనుండి వేరు చేయలేదు.

చీరలు కొనే షావుకార్లు రెండు రోజుల తరువాత పల్లెకు వచ్చారు. చాలా మంది ఇళ్లల్లో నేతను పరిశీలించి, వర్షం తాకిడికి దెబ్బ తినని చీరలకే కూలీ చెల్లించి తీసుకొన్నారు. పాడైపోయిన చీరలకు ఎటువంటి కూలీ ఇవ్వలేదు. వాటిని కార్మికులు కుప్పగా పోసి తగలబెట్టేశారు. అందరికీ అరకొరగా ప్రతిఫలం దక్కింది.

కుళ్లాయప్ప ఇంట్లో వానకు చూరు కూలి, అతని మగ్గం పూర్తిగా దెబ్బతిన్నది. ప్రభుత్వం చెల్లించిన పది వేలతో కొత్త మగ్గం రాదు. షావుకారు అతనికి ఎటువంటి సాయమూ చేయలేదు. కుళ్లాయప్ప పాపం దిక్కుతోచని పరిస్థితిలో వుండిపోయాడు.

"ఈ ముసురు పట్టింది ఆకాశానికి కాదు, తమ జీవితాలకు" అనుకున్నాడు, మునెయ్య.

మునెయ్య నేసిన చీరలలో ఆరు బాగానే వున్నా, వర్షం తాలూకు చెమ్మకు అవి మెత్తబడి, పలచగా కనిపిస్తూ వున్నాయి. వాటికి మళ్లీ పాలిషింగ్ చేయించి గంజి పెట్టి బాగు చేయాలి. ఆసామి వాటికి సగం కూలీ కూడా ఇవ్వలేదు. మిగిలిన రెండు చీరలకు అసలు మజూరి ఇవ్వలేదు.

ఆ నెల మజూరి డబ్బులతో కొడుక్కు ప్రైవేట్ స్కూల్లో ఫీజు కట్టి చేర్చాలనుకున్నాడు, మునెయ్య. 'కొడుకైనా మంచి చదువులు చదివి బాగుపడనీ' అనుకున్నాడు. కానీ ఈ వర్షం అతని ఆశలపై దెబ్బ కొట్టింది. కొడుకు గోపిని ప్రభుత్వ పాఠశాలలోనే ఆరవ తరగతిలో వేశాడు మునెయ్య, గోపి అక్క శాంత ఎనిమిదో క్లాసు గవర్నమెంటు స్కూల్లోనే చదువుతూ వుంది. స్కూలు పూర్తయ్యాక పడుగు తోడడం, కండెలు చుట్టడం- ఇలా చిన్న చిన్న పనులు చేస్తూ తండ్రికి సాయపడ్తోంది. ఆ సాయంత్రం మునెయ్య అల్లు పట్టేందుకు నూలుకట్టెలు తీసుకొని పోతూవుంటే అతనికి పొలంనుండి తిరిగొస్తున్న రైతు రామిరెడ్డి కనిపించాడు. రామిరెడ్డి మొఖంలో సంతోషం వెల్లివిరుస్తోంది.

"ఏం రెడ్డీ! మంచి వుషారుగా వుండావే!" అని పలకరించాడు, మునెయ్య.

"మొన్ననే నాట్లు వేసినాం, ఈ వానలకు ఈ ఏడు టమేట బాగా కాపు వచ్చేట్టుగా వుండాది" అన్నాడు రెడ్డి నవ్వుతూ.

"పోనీలే, ముసురు తనలాంటి వాళ్ల జీవితాల్లో విషాదం నింపినా, కొందరి జీవితాలైనా బాగు చేసింది" అని మనసులో అనుకొన్నాడు, మునెయ్య.

■

# 'కోరకూ' జాతిలో కోరుకున్నంత స్వేచ్ఛ..

**'కోరకూ'** అనే ఆటవిక జాతివారు మహారాష్ట్రలోని అమరావతి జిల్లాలో ఎక్కువగా కనపడతారు. అమరావతి జిల్లాలోని చిఖలదరా అనే ప్రాంతంలో భీముడు, కీచకుని చంపి ద్రౌపదిని రక్షించాడని అంటారు. ఇక్కడ భీమకుండం, శివలింగం ఉన్నాయి. ఈ కుండం లోనే భీముడు రక్తంతో తడిసిన శరీరాన్ని శుభ్రం చేసుకున్నాడట! ఇక్కడ విరాటం పర్వతం ఉంది. విరాట రాజు పేరుమీదుగా ఆ కొండకి ఆ పేరు వచ్చింది. 'కోరకూ' ఆదివాసీలు వేల ఏళ్ల క్రితం నుంచే మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ అడవుల్లో నివసిస్తున్నారు. కురుక్షేత్ర సంగ్రామంలో ప్రాణాలు దక్కించుకున్న కౌరవుల సైనికులు, దారి తప్పి వేరుబడిపోయారని, వారి సంతానమే తామని 'కోరకు' జాతి వారు చెప్తారు. 'కోర' అంటే మనిషి అర్థం. 'కూ' అంటే సముదాయం అని అర్థం. ఈ జాతి గోత్రాల పేర్లు చెట్లకి సంబంధించి ఉంటాయి. మాంసం, చేపల్ని తిని మదిర (సారా) బాగా తాగుతారు. గేదె ముక్కు, శరీరాన్ని గాయపరుస్తూ గ్రామమంతా తిప్పుతారు. దాని రక్తం అంతటా కారితే తమ దేవతలు సంతోషిస్తారని వారి భావం. రాత్రంతా తమ ఇష్టదైవం ముఠవాదేవుని ఎదుట అగ్ని రాజేసి, ఆట పాటలు, నృత్యంతో జాగారం చేస్తారు. మరునాడు దసరా పండుగ జరుపుకుంటారు. హోలీ పండగరోజు రావణుడు, మేఘనాథుని పూజి స్తారు.రావణుని గొప్పతనాన్ని కీర్తిస్తూ పాటలు పాడ్తారు. శివరాత్రిరోజు మహాశివుణ్ని పూజిస్తారు.



'కోరకూ' స్త్రీలు ముఖం, చేతులపై పచ్చ పొడిపించుకుంటారు. అది తమ అందానికి, సౌభాగ్యానికి ప్రతీకగా భావిస్తారు. పురుషులు నెత్తిపై జుట్టు బాగా పెంచుకుంటారు. ఈ జాతి వారు పుట్టుకనుంచి చావుదాకా జానపద పాటలు, నృత్యాల్తో గడుపుతారు. గ్రామంలో డ్యాన్సు చేస్తూ ఉల్లాసంగా గడుపుతారు. వీరి ముఖ్య పండుగ హోలీ.

'కోరకూ' స్త్రీలుపాడే పాటలు చిరుడీ, డోలార్ గీత్ (సోదరీ సోదరుల బంధాన్ని తెల్పేవి) తిరుగలి విసురుతూ పాడేవి. పిల్లలు పాడే పాటల్లో ప్రకృతి, అమ్మా-నాన్నలకి సంబంధించిన పాటలు కోకొల్లలు. డోలు, వేణువు వీరి ప్రధాన వాయిద్యాలు. వేణువును వారు 'పావీ' అంటారు. పుట్టుకనుండి చావుదాకా పాడే పాటలు ఈ రెండింటితో పాడతారు. మన పోతురాజులా వారి 'పడియాల్' లేక భూమకాకికి ప్రత్యేక వస్త్రాలు కట్టబెడ్తారు. అతని చేతిలో ఒక పెద్ద తాడు ఉంటుంది. జుట్టు విరబోసుకుని, కాలికి పెద్ద పెద్ద గజ్జెలు కట్టి చేతిలోని డమరుకంతో ఆడిపాడ్తాడు. అతడిని సర్వదేవతలు ఆవహి స్తారని వారి నమ్మకం. వర్షాలకి స్వాగతం పలుకుతూ కప్పకి పూజ చేస్తారు. ఖేడేదేవుని తాజా ఆకుపచ్చని వెదురుకర్రతో పూజిస్తారు. దానితోటే పొలంలో ఎద్దుల్ని తోలుతారు. జ్యేష్ఠ అమావాస్య రోజు ఈ పండగ చేస్తారు. 'కోరకూ' ప్రజల ముఖ్య పండగలన్నీ జ్యేష్ఠ, భాద్రపద మాసాల్లోనే వస్తాయి. వీటిలో అఖాడీ, జీరోతీ, నాగ పంచమి, పోలా ముఖ్యమైనవి. ఈ పాటలు, ఆటల్తో వరుణదేవుడు ప్రసన్నుడవుతాడని వారి నమ్మకం. వర్షాలు కురవనప్పుడు ఇంకా జోష్‌తో ఆడిపాడ్తారు. ఈ పాటల్తో పంటలు ఇంకా బాగా పండుతా యని వారి నమ్మకం. మ్యూజిక్ థెరపీ అంటే సంగీతంతో పశువులు ఎక్కువ పాలిస్తాయని, పంట బాగా పండుతుందని శాస్త్రవేత్తలు నిరూపించారు కదా! హోలికా దహనం నుంచి అయిదు రోజుల దాకా ఘూమటా గీతాలు, హోలికా దహనం తర్వాత అయిదు రోజులు హోరియార్ గీతాలు అలా పాడుతూనే ఉంటారు.

'కోరకూ' ప్రజలు తమ గ్రామంలో 30 అడుగుల ఎత్తున్న స్తంభాన్ని పాతి దానికి నూనె, మట్టి పూసి చివరన ఒక చిన్న కర్రకు కొబ్బరి కాయ, $1^1/_2$ రూపాయి, బెల్లం మూట కట్టి వేలాడదీస్తారు. రావణా సురుని కొడుకు మేఘనాథుని పూజిస్తారు. స్త్రీలు ఆ స్తంభంచుట్టూ ఆడుతూ పాడుతుంటారు. ఒక పురుషుడు హఠాత్తుగా ఆ స్తంభం ఎక్కి కట్టిన మూటను తీసుకొస్తాడు. స్త్రీలు అతన్ని కర్రల్తో బాదుతుం టారు. పురుషుడు తన ధైర్య సాహసాలు, ప్రతాపం చూపే సమయం ఇదే.

వీరి కుటుంబంలో గౌరవింపబడే వ్యక్తి వృద్ధుడే. అతని కన్నుస న్నల్లో అంతా నడుచుకుంటారు. ఇంట్లో అత్తాకోడళ్లు కలిసి ఇంటి పనులు, వంట పనులు చేస్తారు. పెత్తనం మాత్రం అత్తదే. మహాభయంకర బీదరికంవల్ల మగాళ్లు పెళ్లి చేసుకోలేని స్థితిలో వున్నారు. అందుకే కాబోయే అత్తగారింట్లో 12 ఏళ్లు పని చేయవలసివస్తోంది. అప్పటికిగానీ అతనికి తమ కూతుర్నిచ్చి పెళ్లి చేయరు.

వరుని తల్లి, తండ్రి బీదరికం కారణంగా, కన్యాశుల్కం బదులు తమ కొడుకునే అర్పించి బండచాకిరీకి పంపిస్తారు. అలా కష్టపడి భార్యను పొందుతాడు కోరకూ యువకుడు. ఇక వీరి పల్లెల్లో ఇళ్లు రైలుబోగీల్లా వరుసగా ఉంటాయి. పంచాయితీ పెద్దల్ని దైవంగా భావిస్తారు. వారు వేసే శిక్ష కిమ్మనకుండా అనుభవిస్తారు.

ఇక వీరి పెళ్లిపద్ధతి... వరుని తరపువారే వధువుకోసం వేట మొదలుపెట్టాలి. ఇరువర్గాల వారికి మధ్యవర్తిగా వ్యవహరించే వ్యక్తిని చిటుల్యా అంటారు. వధువుకి 500 నుంచి 900 దాకా రొక్కం,10 మణు గుల ధాన్యం, ఒక ఎద్దు, వరుడు ఇవ్వాల్సి ఉంటుంది. శుక్ర, సోమవారాల్ని శుభ, పవిత్ర దినాలుగా భావిస్తారు. లగ్న ముహూర్తం పెడ్తారు. చైత్ర, వైశాఖ, మాఘ మాసాల్లో పెళ్లిళ్లు చేస్తారు. వరుని ఇంట లేక వధువింట వారి ఆర్థిక పరిస్థితినిబట్టి పెళ్లి చేస్తారు. ఇక వధూవరులు ముందే ప్రేమికులైతే అబ్బాయి ఆమెను లేవదీసుకుని తన ఇంటికెళ్లిపోతాడు. వధువు తరఫువారు సరేనని తల ఊపుతారు చేసేదేమిలేక. వధూవరుల్ని ఎత్తుకుని ఆటపాటల్తో పెళ్లితతంగం ముగిస్తారు. కూతుర్ని అత్తింటికి సాగనంపుతూ హృదయవిదారకంగా పాడుతారు. తమకు నచ్చకుంటే తేలిగ్గా విడాకులు తీసుకోవచ్చు. ఒకరికన్నా ఎక్కువ భార్యలుండ వచ్చు. అలాగే స్త్రీ కూడా స్వేచ్ఛాజీవి. తన కిష్టమైన వారితో ఉండొచ్చు. పెళ్లికి ముందు, ఆ తర్వాత కూడా స్త్రీ, పురుషులకి బోలెడంత స్వేచ్ఛ ఉంటుంది. వితంతువుకీ స్వేచ్ఛ. మళ్లీ పెళ్లి చేసుకోవచ్చు.

'కోరకూ' జాతివారు దేశదిమ్మరులు. వీరు మాట్లాడే భాషను 'ముండా' అంటారు. అడవుల్లో దొరికే ఓషధుల్ని, పళ్లు, కాయల్ని అమ్ముకుని పొట్ట నింపుకుంటారు. కొంతమంది కొండ ప్రాంతాల్లో జొన్న, రాగి, ఉల్లి, వెల్లుల్లి పండిస్తారు. మరికొందరు ఆవులు, గేదెల్ని పెంచుతారు. వాటిని అడవుల్లో మేపుతారు. మాదేవ్-సిరతో, చాందో-సురజో మొ॥ వారి కులదేవతలు. ఏడాదిలో ఒకసారి తమ కులదేవతను తమ కుటుంబ పరంపరగా కొలుస్తారు. ఏదైనా పూజ చేస్తున్నప్పుడు ఆకుపచ్చ వెదురుతో మండపం నిర్మించి నిమ్మ, కొబ్బరికాయల్ని వేలాడదీస్తారు.

**– అచ్యుతుని రాజ్యశ్రీ**

# ఈ వారం కవిత్వం

## జీవధారలు

**జీ**వధారలు నదులెల్ల, జీవముంచు
విశ్వజనులు చూపు మమత, విశ్వమంత
దేశ జనులెల్ల నదుల 'వందే' యనగను
విశ్వసేమమే నేర్పును విశ్వనదులు.

జాతి జాగరూకత నెల్ల జలముతోటి
చెప్పి జీవకోటియు మెచ్చ చెలిమి చేయు
పావనములు జనమునకే ప్రాణధార
పుష్కరములకు 'జేజేల' పూజ సల్ప.

పంచభూతములు నొనరు పంక్తియంత
భూమి, నీరగ్ని, గాలియు భువనములని
గణుతికెక్కె వాటికిని మా గారవంబు
జీవముల జీవదాతగా చిన్నియగను.

పాదతాకిడుల్తోడను పాపములను
జానపదులు నాగలి నొక్క జబ్బుపడుచు
నీరముండని మనుగడ నీది మరియు
చెట్లు లేక కురియు వాన చెపుదు నెటుల?

ఇంత జరుగుచున్న ధరణీ! యిఱుకునొంది
ఆదరించి జీవులకెల్ల నభయ మిడియు
సంతసంబు తోటే నీవు సహన మొంద
చేతులెత్తి వందనముల చేతు నీకు.

– డా॥ తూములూరి పార్థసారథి

## మట్టి హారతి

**మట్టి** చైతన్యం
వానచినుకు అద్దంలో
పచ్చని వెలుగుల్లో కనిపిస్తుంది.

ఎండి పగుళ్ల తీసిన
మట్టి హృదయంపై చినుకు
తొలి సంతకం
చేయగానే
ఆకాశం సాక్షిగా
పొలం నిద్ర లేస్తుంది
పచ్చని తరంగాలను
గుండెగూటికి
మరలిస్తుంది మౌనంగా
ఎండవేడి అలజడుల మధ్య
అదృశ్యమైపోయిన పచ్చదనం
మళ్లీ చినుకుపాటకు బిడ్డకు
పచ్చదనం అన్నంముద్ద
తినిపిస్తున్న
అమ్మలా ఆత్మీయత
చినుకును కడుపులో
దాచుకొంటున్న
మట్టితల్లికి
గాలి స్వాగతం పలుకుతోంది
ఎండాకాలం కొయ్య బొమ్మ
నేడు చినుకు నేత్రాలతో
పచ్చని ఊపిరితో
చిగురురెమ్మ నిరీక్షణ
మానవతా సుగంధం నింపుకొని
బంధాల అనుబంధాలతో
కొత్త జ్ఞాపకాలతో
కనిపించకుండా ప్రవహిస్తున్న
జీవ చైతన్యం
మనిషికి మంచి చేయాలనే
తపనతో
ఆకాశానికి మట్టి ఆశగా శ్వాసగా
చినుకుకోసం చిగురుకోసం
స్వా'గతం' హారతి ఇస్తోంది
చందన స్పర్శతో మట్టి
వెలుగులు ప్రసరిస్తుంది
వానాకాలం
చిగురు కిరణాలతో
జాగృతి వైపు పరుగులు.

– నల్లా నరసింహామూర్తి

## కొమ్మ

**పూత,** కాత, ఆకులు,
ఫలాలు
పుల్లలు, పూలు ఇచ్చేది
కొమ్మ!

కొమ్మ లేని చెట్టు
పిట్టకైనా, జంతువుకైనా
మనిషికైనా, ప్రకృతికైనా
నిరర్థకమే!

కొమ్మలు నిండుగుంటేనే
చెట్లకు అందం.
చెట్లు, చెట్లు కలిస్తేనే
గట్టు!

గట్టుకైనా, గుట్టకైనా
చెట్లే శోభాయమానం!
మహిళలే, మనసేలే
మహిళలు కూడా
కొమ్మలే... ఆ కొమ్మలే
అమ్మలై
పుడమికి పునరుత్పత్తిని
ఇస్తాయి!

వృక్షోత్పత్తికైనా...
జీవోత్పత్తికైనా...
కొమ్మలే!

– ఎన్నవెల్లి రాజమౌళి

## అనుబంధం

**మరుమల్లెల్లా** కవ్విస్తూ మురిపెంగా హాయినిపంచుతూ
నీ చిరునవ్వుల సరిగమలు...
సరాగాల వెల్లువలా పల్లవిస్తూ హృదయంలో
మ్రోగే నీ కాలి సిరిమువ్వల చిరుసవ్వడులు...
ప్రభాత వేళ వీచిన చల్లని చిరుగాలల్లే అల్లేస్తూ అల్లరి
చేస్తూ
నా వెన్నంటి వుండే నీ తలపులు...
మంచుతెరలను చీల్చుకుంటూ వచ్చే తొలివేకువ
కిరణాల
నులివెచ్చని అనుభూతిని పోలిన..నీ జ్ఞాపకాల జడి...
ఆత్మీయ అనుబంధం...
ఎన్నటికీ వీడని నా జీవన ప్రాణబంధం!

– గొర్రెపాటి శ్రీను

## రచనలకు ఆహ్వానం

రచయితలనుండి కథలు, కవితలు, సమకాలీన వ్యాసాలు స్వాగతిస్తున్నాం. రచనలతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని రచనలు తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి. ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న రచనలు పంపించకండి. **రచనలు పంపించాల్సిన చిరునామా:**

**ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్, డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్–80**

# హాఫ్ టికెట్

– కృష్ణ మాధవరపు

టవున్ రైల్వే స్టేషన్‌కి వచ్చి టికెట్ తీసుకుని ప్లాట్‌ఫారంమీద నిలబడి పరకాయించి చూసాను. ప్రయాణికులు పల్చగా వున్నారు. విశాఖ పోయే పాసింజరు ట్రైన్ పోర్టు స్టేషను నుండి ఈ స్టేషనుకొచ్చి బయల్దేరుతుంది. ఇంకా రాలేదు.

"తాతా! రైలు బయల్దేరి విశాఖపట్నం ఎన్ని గంటలకి చేరుతుంది?" అన్న ప్రశ్నకి పక్కకి తిరిగి చూసాను.

తాతా, మనవడు అనుకుంటాను.

ట్రైల్స్ నేలమీద సంచి పరిచి దానిపై కూర్చుని వున్నారు. పెద్దాయనకి రమారమి అరవై సంవత్సరాలు వుంటాయి కాబట్టి ఫుల్ టికెట్. వయసు ప్రశ్నించిన మనుమడిది హాఫ్ టికెట్ ఏజ్.

అర టికెట్ మళ్లీ అడిగేసరికి, ఫుల్ టికెట్ "చేరేక.. చేరుకున్నాం అనుకోవాలి. వాన రాకడ ప్రాణం పోకడ రైలు నడక ఒకటేరా అబ్బిగా!" అన్నాడు.

హాఫ్ టికెట్‌కి అర్థమై నవ్వాడో అర్థంగాక నవ్వాడోగాని నేను మాత్రం పెద్దాయన చమత్కారానికి సన్నగా నవ్వుకున్నాను. ఈలోగా పాసింజర్లు పెరిగారు.

చాలా లేట్‌గా వచ్చిన ట్రైనెక్కి కిటికీ పక్క సీట్లో కూర్చున్నాను. నా వెనుక వచ్చిన తాత, మనుమడు నా ఎదుటి సీట్లలో కూర్చున్నాక బాలుడు కిటీక పక్కన సర్దుక్కూర్చున్నాడు.

చాలాసేపటికి రైలు బయలుదేరింది. బాలుడు విండోలోంచి కదిలిపోతున్న పరిసరాలని ఆసక్తిగా గమనించసాగాడు. నేను, పెద్దాయన అటు ఇటుగా చూస్తూ చూస్తూ మధ్యలో మా చూపులు కలిసినపుడు నవ్వుకుని స్వీయ పరిచయం గావించుకున్నాక లోకాభిరామాయణం మొదలుపెట్టాం.

తాజా రాజకీయాలు, పెరిగిపోతున్న ధరలు, నేటితరం వింతపోకడలు, రెచ్చగొడుతున్న స్త్రీల వస్త్రధారణ, యువతులపై అకృత్యాలు, సహజీవనం, అధికమవుతున్న విడాకుల సంఖ్య, వాతావరణ కాలుష్యం, రైల్వే బడ్జెట్, రైళ్ల నత్తనడక... వగైరాలు మా రామాయణంలో దొర్లిపోతున్నాయి.

పెద్దాయన తనదైన శైలితో చమత్కారాన్ని రంగరించి సమకాలీన సమస్యల్ని వినోదభరితం గావిస్తున్నాడు. ఆయన హాస్య, వ్యంగ్య ధోరణికి నేను నవ్వుతున్నప్పుడు రైలు కొన్ని స్టేషన్లలో ఆగడం పాత ప్రయాణికులు దిగడం కొత్త పాసింజర్లు గబగబ ఎక్కి సీట్లలో ఆసీనులు అవడం చకచక జరిగాయి. జరిగిపోతున్నాయి కూడా! ఇవన్నీ గమనం రానంతగా పెద్దాయన సంభాషణా బాణి నన్నమితంగా ఆకట్టుకుంది. అందువల్ల మా సంభాషణ ఆగకుండా కొనసాగింది.

ఆ సమయంలో అర టికెట్ లేచి నిలబడి చిటికెన వేలు చూపించి గొణిగాడు. వెంటనే అర్థం చేసుకున్న చమత్కార ప్రవీణ పెద్దాయన మాటలాపి బాలుడికి టాయిలెట్ చూపించి వచ్చి కూర్చున్నాడో లేదో టీసి వేంచేసి 'టికెట్ ప్లీజ్' అన్నాడు.

మరుక్షణం వినోదప్రియుడు పెద్దాయన జేబునుండి తీసి యిచ్చాడు. నా టికెట్ యివ్వబోతూ టీసి నవ్విన నవ్వుకి ఆగిపోయి ఆశ్చర్యంగా చూడసాగాను.

పెద్దాయన్ని, ఆయన టికెట్‌ని పట్టి పట్టి మార్చి మార్చి చూస్తూ టీసి నవ్వాపలేదు. నవ్వుతూనే వున్నాడు. ఎందుకో నాకు సహ ప్రయాణికుని అర్థంగాక చూస్తుండిపోయాం. క్వశ్చన్ మార్కు మొహాలతో.

తనని, తన టికెట్‌ని టీసి గుచ్చి గుచ్చి చూసినట్టు పెద్దాయన టిసిని, అతడి నవ్వుని గమనించాడు. కొద్దిసేపు తర్వాత నా వైపు చూసి నవ్వాడు.

వెంటనే... టీసిని ఎందుకు నవ్వేరని అడగబోయి మానుకున్నాను. అంతలో అతడి పెదవులు కదిలాయి "సార్! తమరు వయస్సుకి పెద్దవాడై వుండి కూడా అర టికెట్... అదే హాఫ్ టికెట్ తీసుకున్నారేమిటి?" అంటూ "మీకిది తగునా?" అన్నట్టు పెద్దాయన్ని తదేకంగా చూస్తూ టీసి నవ్వు కంటిన్యూ చేసాడు.

హాఫ్ టికెట్ సంగతి తెలియని ప్రయాణికులు అవగతమయ్యేక పెద్దాయన్ని ఆశ్చర్యంగా చూడసాగారు. నేను మాత్రం ఇలా ఊహించాను.

తన మనుమడి అర టికెట్ పొరపాటుగా ఇచ్చినట్టు చెప్పి తన పూర్తి టికెట్ పెద్దాయన ఇస్తాడు అనుకున్నాను. కానీ నేను భావించినట్టు జరగలేదు. ఇలా జరిగింది.

"అయ్యా! టిసిగారూ! నన్ను అన్యథా భావించక నేను చెప్పేది సాంతం వినమని కోరుకుంటున్నాను" అంటూ చమత్కార ప్రియుడు పెద్దాయన కొనసాగించాడు. అందరూ వింటున్నారు ఆసక్తిగా...

"నేను టవున్ స్టేషన్‌కి అర టికెట్ ఈడులో వచ్చి హాఫ్ టికెట్ కొనుక్కుని రైలుకోసం ఎదురుచూడసాగాను. ఎంత కాలం గడిచినా నా నిరీక్షణ ఫలించలేదు. అయినా నిరీక్షించసాగాను. ట్రైన్ జాడ లేదు. ఆ నిరీక్షణలో నా బాల్యం, యవ్వనం దశలు దాటిపోయాక వచ్చిన ట్రైనెక్కి కూర్చున్నాను. వెంటనే కదల్లేదు. కదిలాక లంకణాల బండిలా ఆగి ఆగి సాగిపోతున్నప్పుడు కౌమార దశ దాటిపోయి నాకు వృద్ధాప్యం వచ్చింది.




అప్పుడు కొన్న హాఫ్ టికెట్ మీరడగ్గానే మీ చేతిలో పెట్టాను. భారతీయ రైళ్ల ఒక జీవిత కాలం లేట్‌గా ప్రయాణం చేస్తాయి... అన్న ఆరోపణకి నేను ప్రత్యక్ష సాక్ష్యం. అన్యథా భావించక ఏమంటారు? అని ప్రశ్నతో ముగించేసరికి కోపం, ఉద్రేకం, తామసం గట్రా టీసికి రాలేదు సరికదా ఆనందంగా విని ఆప్యాయంగా చూస్తుంటే...

నేను, తోటి ప్రయాణికులు పెద్దాయన సమయస్ఫూర్తిని మెచ్చుకున్నాం. అది అతిశయోక్తి అయినా చమత్కారంతో మెప్పించాడు.

అప్పుడు టాయిలెట్ నుండి వచ్చిన బాలుడు ఫుల్ టికెట్ నిక్కరు జేబులోనుంచి తీసిచ్చాడు.

టికెట్లు తారుమారయ్యాయి. దాన్నిలా పెద్దాయన మార్చి చెప్పాడు.

తర్వాత అందరూ ఆనందించేటట్టు ఇలా జరిగింది.

"ఏరా అప్పారావు! నీ 'నవ్వు' మారలేదు. అదే నిన్ను పట్టిచ్చింది. మనం కలుసుకుని చాలా ఏళ్లయిందిరా!" అంటూ హస్తాలు చాపాడు ఫుల్ టికెట్ పెద్దాయన.

"ఒరే రామారావుగా! నీ ఊతపదం 'అన్యథా భావించకు' ఉచ్చారణ నిన్ను పట్టిచ్చింది" అంటూ టిసి అప్పారావు చేతులు చాపి కదిలాడు.

రామారావు కూడా ముందడుగు వేసాడు.

ఇద్దరూ దగ్గరకొచ్చి ఆనంద భాష్పాలతో ఆత్మీయంగా కౌగిలించుకున్నారు.

ఆ అద్భుత దృశ్యాన్ని వీక్షిస్తున్న మా అందరికి మా స్నేహితులు గుర్తుకొచ్చి పులకించిపోయాం.

ప్రాణం లేని ఒక హాఫ్ టికెట్ ప్రాణమిత్రులని కలిపి పుణ్యం మూట కట్టుకుంది.

■

**వాస్తువార్త**

వాస్తువిద్వాన్ సాయిశ్రీ

**డా॥ దంతూరి పండరినాథ్**

3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3

సెల్స్: 9885446501/ 9885449458


# కట్టుకున్న ఇల్లు కలిసిరావటం లేదు!



**ఎస్.ఆర్ - కడప**

**ప్రశ్న: ఇల్లు కట్టుకున్నాక సమస్యలు చెప్పుకోలేని విధంగా తయారయ్యాయి. ఇంటిప్లాను గీసి, పంపిస్తున్నాను. మా నాన్న ఆరోగ్యం ఇల్లు కట్టుకున్నాక అసలు బాగవటం లేదు. మేం ఇద్దరం ఆడపిల్లలం, ఒక మగ పిల్లవాడు. వాడికి 35 సంవత్సరాలు. ఇంకా పెళ్లి కుదరటం లేదు. లగ్నందాకా వచ్చి ఆగిపోతోంది. అక్కచెల్లెళ్లం ఇద్దరం పుట్టింటికి వస్తే అత్తవారింటికి పోలేం. ఇల్లు కట్టకుండా అద్దెకున్నప్పుడు ఎంత బాగా రాకపోకలుండేవో! ఇప్పుడు బంధువులంతా మమ్మల్ని శత్రువులుగా చూస్తున్నారు. ముఖ్యంగా మా అమ్మ బాధ చూడలేకపోతున్నాం.**

**జవాబు:** ఇంటిలోపల నైరుతి పడక గదికి నైరుతి మూలలో అటాచ్డ్ బాత్‌రూమ్ నిర్మించారు. కింద ఫ్లోర్, పై ఫ్లోర్‌లోను ఈ విధంగా కట్టబడినటువంటి బాత్‌రూమ్‌లను తీసివేయాలి. పైన బీమ్ కనిపించకూడదు. నైరుతి బెడ్‌రూమ్, మిడిల్ రూమ్/హాలుకి మధ్యలో బాత్‌రూమ్ నిర్మాణం చేసుకోవచ్చు. కింద ఫ్లోర్‌లో వరండాను కూడా గదిగా మార్పు చేయడంవలన ఈశాన్యం తగ్గిన దోషం నవరింపబడుతుంది. ప్రస్తుతం అజమాయిషిని సూచించే నైరుతి మూలన టాయిలెట్ వున్నది. అలాగే సంతానం, సంపదను వృద్ధి గావించే ఈశాన్యం తగ్గింది. ఈ రెండు దోషాలవల్ల మీరు పేర్కొన్న క్లిష్ట పరిస్థితులు మీకు అనుభవంలోకి వస్తున్నాయి. ఎప్పుడయితే ఇవి పైన చెప్పిన విధంగా సవరింపబడతాయో, అప్పుడు మీకు తప్పకుండా మంచి ఫలితాలుంటాయి.

## అమ్ముడు పోవడం లేదు...!

**ఒక సోదరుడు - వియ్యూరు**

**ప్రశ్న: పడమర వీధి గల ఈ స్థలంలో తూర్పు భాగంలో ఇల్లు కట్టుకున్నాను. మిగతా సగం, పశ్చిమ రోడ్డు భాగం అమ్ముదామని నిర్ణయించుకున్నాను. ఆ స్థలంమీద అప్పులు కూడా చేశాను. రెండు సంవత్సరాలు అవుతోంది. అమ్ముడు పోవడం లేదు. చుట్టుపక్కల ఇండ్లు, చక్కని పరిసరాలు, ఊరి మధ్యలో ఉన్నది. అడిగినవారు ధర తక్కువకు అడుగుతున్నారు. 'మళ్లీ వస్తాం' అంటున్నారు కానీ తిరిగి రావడం లేదు. ఈ స్థలం ప్లాను మీకు పంపిస్తున్నాను. పరిష్కారం చూపించగలరు.**

**జవాబు:** స్వరూపరీత్యా ఇది పశ్చిమ వాయువ్యం పెరిగిన స్థలం. అధికమయిన జనాదరణను కలిగించే స్థలం. మంచిది, రాజకీయ నాయకులకు కలిసివచ్చే స్థలం. అమ్మదగిన స్థలం కాదు. కానీ ఈ స్థలంలో తూర్పులో ఇల్లు కట్టి పడమర ఖాళీగా వదిలివేయటంవలన వాస్తుదోషమేర్పడింది. అందువల్ల మీకు ఆర్థిక ఇబ్బందులు కలుగుతున్నాయి. మొత్తం స్థలానికి నైరుతి భాగంలో పడమర, దక్షిణ హద్దులనానుకొని 10x10 అడుగుల గది నిర్మాణం గావించండి. ఒక మెట్టు ఎక్కి గదిలోకి వెళ్లేలా ఉండాలి. ఉత్తర వాలుగా రేకులు వేయించండి. అమ్ముడయ్యే అవకాశాలు పెరుగుతాయి.

## ఫొటోలు ఎటువైపుండాలి?

**పి.ఎల్.ఆర్ - హైదరాబాద్**

**ప్రశ్న: దక్షిణాన పడక గది, నైరుతిలో స్టోర్ రూమ్, వాయువ్యంలో పూజగది ఉన్నాయి. దేవుని ఫొటోలు ఉత్తరంగోడ కింద పీట వేసి పూజ చేస్తున్నాం. అలా చేయవచ్చా?**

**జవాబు:** వాయువ్యంలో పూజగది వుండవచ్చు. పూజగదిలో పటాలను లేదా విగ్రహాలను పశ్చిమగోడకు చేర్చి తూర్పునకు అభిముఖంగా ప్రతిష్ఠించుకోవచ్చు. పూజ గావించుప్పుడు మనం ఆ పటాలకు ఎదురుగా అంటే పశ్చిమాభిముఖంగా కూర్చుని వుండాలి. పటాలుగాని, విగ్రహాలుగాని, పూజించునప్పుడు మన దృష్టికెదురుగా కనిపించే విధంగా అమర్చుకోవాలి. పటాలను కిందకు చూస్తూ పూజించకూడదు. ఉత్తరానికి అభిముఖంగా పూజ చేస్తున్నారంటే పటాలన్నీ దక్షిణాభిముఖంగా వున్నాయని అర్థమవుతుంది. అలా వుండకూడదు. తూర్పు దిక్కుకు అభిముఖంగా పూజలు చేయడానికి ప్రథమ ప్రాధాన్యం ఇవ్వాలి. పశ్చిమాభిముఖంగా పూజలు చేయడానికి ద్వితీయ ప్రాధాన్యం ఇవ్వాలి. పూజగది కట్టటానికి వీలు కానప్పుడు నిలబడి పూజలు చేయడం మంచి ఫలితాలనిస్తుంది. అయితే మన ఎత్తుకు సరిపడే విధంగా గోడకి పూజా మందిరాన్ని (షెల్ఫుల్లో) ఏర్పాటు చేసుకొని, షెల్ఫులకి కర్టెన్స్ ఏర్పాటు చేసుకోవాలి. కింద వైపుకి పటాలను ఏర్పాటు చేసుకోకూడదు. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ----------------------------------------

పుట్టినతేదీ:------------------- ఊరు: -------------

జన్మనక్షత్రం:---------తల్లిపేరు:---------------------

చిరునామా: ----------------------------------------

------------------ ఫోన్: ----------------------

# పర్సనల్ పాయింట్

చల్లా సుబ్రహ్మణ్యం
1 సి–ఐక్యూ టవర్స్, 3–4–540,
నారాయణగూడ, హైదరాబాద్–27
మొబైల్: 9866362224/ 9553662224
challascounsel@gmail.com
www.challascounsel.com



# అమ్మాయిది ఎప్పుడూ నెగిటివ్ థింకింగ్...!

కె.ఆర్.ఆర్ – సికింద్రాబాద్

ప్రశ్న: నా వయసు **40**. మా వారు, నేను గవర్నమెంట్ ఉద్యోగులం. మాకు ఇద్దరు పిల్లలు. ఒక పాప, బాబు. పాపతోనే సమస్య. బి.టెక్. ఫస్ట్ ఇయర్ చదువుతోంది. తను సగటు స్టూడెంట్. కానీ ప్రతి విషయంలోనూ అనుమానమే! చాలా నెగిటివ్‌గా ఆలోచిస్తుంది. ప్రతీది తనకి వ్యతిరేకంగా చేస్తున్నామనీ, ఎవ్వరూ తనని పట్టించుకోరనీ, తన ఫ్రెండ్స్ తనని నిజంగా ఇష్టపడుతున్నారా? లేదా? తనకంటే అందరూ బాగా చదువుతారనీ అనుకుంటుంది. ఎవ్వరినీ నమ్మదు, తనని తనే నమ్మదు. ఇలా... పొద్దున లేచిన దగ్గర్నుంచి ప్రతి పనిలోనూ అనుమానమే! మా అత్తగారికి కూడ ఈ లక్షణం ఉంది. ఇది వంశపారంపర్యంగా వచ్చిందా? అని నా అనుమానం. పాప ఎందుకిలా వుంది? నేనేం చేయాలి?

జవాబు: ఇది వారసత్వంతో వచ్చింది కాదు. కానీ ఇంటి వాతావరణం, తల్లిదండ్రుల ప్రవృత్తి, దాన్ని మీరు ఎత్తి చూపించడం, ఇంట్లో జరిగే వాదోపవాదాలు– ఇవన్నీ మీ అమ్మాయిని ప్రభావితం చేస్తాయి. తనని తనే నమ్మకపోవడం, ఎవర్నీ నమ్మకపోవడం అనే ధోరణికి కారణం.. ఆత్మవిశ్వాసం లోపించడం. తనమీద తనకి నమ్మకమే కాదు... ధైర్యం కూడా కోల్పోయింది. ఆత్మవిశ్వాసం విజయానికి పునాది. ఇవే మనిషిని విజయంవైపు నడిపిస్తాయి. అవకాశం వుంటే పాపకి ప్రాణయోగ కౌన్సెలింగ్ ద్వారా ఆత్మవిశ్వాసం, తనతో తను బాగుండటం లాంటి టెక్నిక్స్ నేర్పించండి. ఉపయోగం ఉంటుంది.

## ప్రేమకు.... చిరునామా!

కె.యస్ – స్టీల్ సిటీ

ప్రశ్న: నా వయసు **24**. మా ఆఫీస్‌లో నా కొలీగ్, నేను ఒక సంవత్సరం నుంచి ప్రేమించుకుంటున్నాం. పెళ్లి చేసుకుందామని నిర్ణయించుకున్నాం. కనుక ఇంకా బాగా దగ్గరయ్యాం. కానీ ఈ మధ్య జరిగిన ఒక సంఘటన పెద్ద షాక్ ఇచ్చింది నాకు. తను పంపించిన ఎస్.ఎమ్.ఎస్. చూసి తల తిరిగిపోయింది. ఇంకెవరికో పంపాల్సిన మెసేజ్ పొరపాటున నాకు పంపించింది అని అర్థమైంది. నిజానికి ఆ రోజు మేం కలిసేవున్నాం. తను హాస్టల్‌కి వెళ్లాక కూడా నాతో ఫోన్‌లో మాట్లాడుతూనే వుంది. కానీ నా ఫోన్ పెట్టేశాక అంటే రాత్రి **12.30** నుంచి రెండింటివరకు వేరే బాయ్ ఫ్రెండ్‌తో మాట్లాడిందనీ, అప్పుడు వాళ్లిద్దరి మధ్య జరిగిన రొమాన్స్‌కి సంబంధించిన డైలాగ్స్ (మధుర స్మృతుల్ని) నెమరు వేసుకుంటూ ఆ మెసేజ్ పంపింది. అయితే అది పొరపాటున నాకు పంపింది. వెంటనే రాత్రి మూడింటికి 'సారీ' అని మెసేజ్ కూడా పంపింది. ఇప్పుడేం చేయాలి? నాకు నా మీదే అసహ్యం వేస్తోంది.

జవాబు: మనల్ని మనం ఎప్పుడూ అసహ్యించుకోకూడదు నాయనా! అయినా జరిగింది చాలా సంతోషించాల్సిన విషయం. లేకపోతే బతుకేమయ్యేది? ఒక్కసారి ఊహించు. సో... జరిగినదానికి దేవుడికి థాంక్స్ చెప్పుకుని ఆనందంగా కొత్త జీవితం ప్రారంభించు. అయితే అది ఎలా ప్రారంభించాలో... ఎలా సాగించాలో... ఏం నేర్చుకోవాలో... ఏమేమి మరిచిపోవాలో– లాంటివన్నీ రాయడం ఇక్కడ సాధ్యంకాదు. కనుక 'ప్రేమ... దాని చిరునామా" తీసుకోవాల్సిన జాగ్రత్తలు, ఆ టెక్నిక్స్ (సూత్రాలు) మనోప్రాణయోగ కౌన్సెలింగ్ ద్వారా నేర్పిస్తాను. వచ్చి నేర్చుకో. గుడ్ లక్. ■

## అబ్బాయిని ఎలా అర్థం చేసుకోవాలి?

వి.యల్.జి – కరీంనగర్ జిల్లా

ప్రశ్న: నా వయసు **42**. నా భార్య వయసు **38**. మాకు ఒక అబ్బాయి. వయసు **14** సంవత్సరాలు. ఒక్కడే కొడుకైనా గారాబం, ముద్దు చెయ్యకుండా ఎంతో క్రమశిక్షణతో పెంచే ప్రయత్నం చేశాం. మీరు చెప్పినట్లుగా పిల్లవాణ్ణి ఒక్క దెబ్బ వెయ్యకుండా (కొట్టకుండా) పెంచాం. కానీ మా అబ్బాయిలో మేం ఆశించిన ఫలితాలు కనపడలేదు.

మా అబ్బాయి ప్రస్తుత లక్షణాలు:

* చదువుపట్ల శ్రద్ధ లేకపోవడం.
* నిర్లక్ష్య వైఖరి (ప్రతి విషయంలోనూ... అందరిపట్ల)
* స్నేహితులు, సరదాలు, ఎప్పుడూ ఎంజాయ్‌మెంట్‌కోసం తపన.
* ఎదురు సమాధానాలు, పెద్దలమీద గౌరవం లేకపోవడం.
* ఎవరు తనకు మంచి చెప్పాలనుకున్నా వారినుంచి తప్పించుకోవడం.
* ఒక క్షణంలో ఉత్సాహం, ఆనందం; అంతలోనే కోపం, నిరాశ, నిస్పృహ.
* స్థిరత్వం లేకపోవడం. దేనిమీదా ఏకాగ్రత ఉండదు.
* విషయాల్ని లైట్‌గా తీసుకుంటాడు. దేనిమీదా అంకితభావం, సీరియస్‌నెస్ లేదు.
* ఒక లక్ష్యం అంటూ లేదు. ఎటు గాలి వీస్తే అటు కొట్టుకుపోయే మనిషి. వీట్లోంచి బయట పడదానికి మా అబ్బాయిని ప్రాణయోగ కౌన్సెలింగ్‌కి తీసుకువద్దామని.. అనుకుంటున్నాం. ఫలితం ఉంటుందా?

జవాబు: ప్రాణయోగ కౌన్సెలింగ్ ద్వారా 1) లక్ష్యం నిర్దేశిత సూత్రాలు 2) ఏకాగ్రత టెక్నిక్స్ 3) స్టడీ టెక్నిక్స్ 4) జీవిత విలువలు నేర్పించవచ్చు. అంతవరకు ఫలితం ఉంటుంది. కానీ అబ్బాయిని ఈ లక్షణాల నుంచి బయటికి తీసుకొచ్చి కాపాడుకోవడానికి తల్లిదండ్రుల సహకారం చాలా అవసరం. అంటే మీ భార్యాభర్తలిద్దరూ బాబుని సొంతం చేసుకోడానికి, తను మిమ్మల్ని సొంతం అనుకోడానికి మీ ఇద్దరిలోనూ రావాల్సిన మార్పులకోసం కౌన్సెలింగ్ మీకు కూడా అవసరం. ఏ భేషజాలకు పోకుండా మీరందరు సిద్ధపడితే మీకూ, బాబుకీ కూడా ఉపయోగం ఉంటుంది. ■

# పద మథనం-90

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | | ■ | 5 | 6 |
| | ■ | 7 | | | ■ | | ■ | 8 | | |
| ■ | 9 | ■ | ■ | 10 | | ■ | 11 | ■ | | ■ |
| 12 | | | ■ | | ■ | 13 | | 14 | | |
| ■ | | ■ | 15 | | | | ■ | | ■ | ■ |
| 16 | | | ■ | ■ | ■ | | ■ | 17 | | 18 |
| | ■ | ■ | 19 | ■ | ■ | | ■ | | ■ | |
| 20 | 21 | | | | 22 | ■ | 23 | | 24 | ■ |
| 25 | | ■ | | ■ | 26 | | | ■ | | ■ |
| | ■ | 27 | | ■ | | ■ | 28 | 29 | | |
| 30 | | ■ | 31 | | | ■ | ■ | 32 | | ■ |

## ఆధారాలు

**అడ్డం**

1. మహారాష్ట్ర సింహం... ఈ ఛత్రపతి-3
3. ఆహుతులతో నిండిన పాటకచ్చేరీ-4
5. 6 నిలువులో నిటారుగా తిరగబడిన బాధ-2
7. చిందర వందరగా ఉంటే మార్దవం ఎలా ఉంటుంది-3
8. నీచ కార్యాలాచరించు పరమ ఘనుడు-3
10. అభయం ఇచ్చినా, ముందే గుండెజారిపోయేంత భీతి కలుగుతోంది-2
12. రెండు వేళ్ల చప్పుడు-3
13. పెళ్లి కాని చిన్నపిల్ల-5
15. వరస, గురవుల్లోనూ ఒకరి తర్వాత ఒకరిని మనం చూడవచ్చు-4
16. నెత్తికెత్తుకునే పెద్ద బుట్టలు-3
17. ఉపాయం, తడితే కిటికీలోంచి కూడా పారిపోవచ్చు-3
20. భూమిని పైకి తెచ్చిన విష్ణుమూర్తి రూప విశేషం-6
23. మిద్దె.. ఇంట్లో వాడనివి, పనికిరానివి పెట్టే చోటు-3
25. తరువు చివరంటా నరికినా చెట్టు చెట్టే-2
26. సముద్రం, కడలి, సాగరం-3
27. పాస్‌పోర్ట్‌తోపాటు ఇదీ ఉంటేనే విదేశాలు తిరగొచ్చు-2
28. గ్రాంథిక దురద-4
30. అటూ ఇటూ అయిన ప్రాణం-2
31. ఎదురొస్తున్న మునులు-3
32. భుజంగం-2

**నిలువు**

1. నేరస్తుడికి అమలు చేసేది-2
2. శరీరంలో ఊపిరి ఆడుతుంటేనే ఇది ఉన్నట్టు-2
3. గాడిద గొంతు-5
4. సవ్వడి మధ్యలో ఆపేసినా వినిపించే ధ్వని-2
5. సుబాహుడి సోదరుడు ఇక్కడ తిరగబడ్డాడు-4
6. 5 అడ్డమే. బాధ, ఏడుపు, వ్యథ వంటిది-2
9. కనురెప్ప విప్పడానికి ఇది చంటిపాప కాదు-4
11. కిందనుంచి పెల్లుబుకుతున్న లావా-2
13. నామకరణ మహోత్సవం-4
14. నిద్రమత్తుతో తూగిపడటం-5
16. శివుడు జటాజూటం నుంచి జలాన్ని ధారగా వదిలిన ఘట్టం-6
18. ఎడమ నుంచి ఆ పక్కకి లాగితే అంతా రైటే-2
19. తల్లి కడుపున బిడ్డని మోసే నెలలు-5
21. వస్తారో, రారో తెలీదు. రారు అనే చెప్పండి-2
22. ముందు రమ్మంటే, ఈ జనంతో ఎర్రగంధం/ఎర్ర చందనం వస్తుంది-4
23. తక్కువేమీ కాదు ... ఎక్కువే-3
24. పురె-4
29. శీర్షాసనంలోనే పాదమని అడగండి-2

**- నిర్వహణ: వాడ్రేవు ఉమాశంకర్**

## పద మథనం - 88 సరైన సమాధానాలు రాసినవారు

1. ఎస్.శ్రీనివాసరావు-ఎమ్మిగనూరు 2. సి.హెచ్.నాగార్జునశర్మ-తిరుపతి 3. పి.జె. రత్నం-నరసరావుపేట 4. చల్లా శ్రీసౌమ్య, చల్లా సరోజ, చల్లా సుబ్బారావు, చల్లా ప్రవీణ్‌కుమార్, చల్లా పవన్‌కుమార్, చల్లా లక్ష్మీనరసింహామూర్తి, చల్లా సూర్యసిద్ధార్థ-సనత్‌నగర్ 5. బత్తుల యాదగిరి-ఉప్పల్ 6. ఎం.శ్రీవాణీ గిరిజాదేవి-రాజమండ్రి 7. ఎ.అన్నపూర్ణ-బాలయ్యశాస్త్రి లేఅవుట్ 8. ఎ.బాలసుబ్రహ్మణ్యం-కూకట్‌పల్లి 9. జి.బలరామశాస్త్రి-మల్లాపూర్ 10. బి.కృష్ణమూర్తి-హుజూర్‌నగర్ 11. ఉషశ్రీ-కొత్తపేట 12. యం. వి.రమణకుమారి-హైదరాబాద్ 13. కోలా శివాజిరెడ్డి, కె.లింగమ్మ-మాచర్ల. 14. ఎం.విష్ణువర్ధన్‌రెడ్డి-జగిత్యాల 15. పరిమి శ్యామలా రాధాకృష్ణ-మదనపల్లి 16. హెచ్.జె. సువర్ణ-కర్నూలు 17. అశోక్ వి-పాత బోయినపల్లి 18. ఎస్.పి.గంగిరెడ్డి, ఎన్.ధనలక్ష్మి-రాజమండ్రి 19. ఇ.శ్యామసుందర్, సి.రాజలక్ష్మి, యస్.యస్.ఎగ్గోని- పుప్పాలగూడా 20. ఎ.సుబ్బారావు-గుంటూరు 21. పి.రాజేశ్వరరావు-అలకాపురి 22. జి.బలరామ శాస్త్రి-మల్లాపూర్ 23. తిరుమల వెంకట సూరయ్యనాయుడు, టి.కనకవల్లి-మల్లాపూర్ 24. జవంగుల కుమారస్వామి-పిడుగురాళ్ల 25. కె.సుమిత్ర-పద్మారావు నగర్ 26. గోశికే నాగమణి వేంకటేశం-చిక్కడపల్లి

## పద మథనం - 89 సమాధానాలు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఉ | ష | 2 శ్రీ | ■ | 3 భా | గ | 4 వ | తం | ■ | 5 బా | 6 క్రీ |
| ఛి | ■ | 7 శ్రీ | దే | వి | ■ | ఢ్మ | ■ | 8 రె | మ్మ | లు |
| ■ | 9 న | ■ | ■ | 10 త | టి | ■ | 11 మూ | ■ | మా | ■ |
| 12 వ | త్స | ము | ■ | రా | ■ | 13 ఛి | తి | 14 మం | ట | లు |
| ■ | భా | ■ | 15 ఆ | లు | ఛి | ప్ప | ■ | చు | ■ | ■ |
| 16 న | మ | కం | ■ | ■ | ■ | కూ | ■ | 17 కొం | ద | 18 రు |
| ర | ■ | ■ | 19 వం | ■ | ■ | డు | ■ | డ | ■ | ధి |
| 20 క | 21 ని | పిం | చ | ని | 22 వి | ■ | 23 మ | లు | 24 పు | ■ |
| 25 చ | వి | ■ | శి | ■ | 26 కా | వే | రి | ■ | ష్ప | ■ |
| తు | ■ | 27 మ | ఖ | ■ | ర | ■ | 28 ది | 29 వా | క | రం |
| 30 క్షి | అ | ■ | 31 లు | ప్త | ము | ■ | ■ | 32 న | ము | ■ |

పేరు:

ఊరు:

